# కన్యాశుల్కము.

గ్రంథకర్త:—గురజాడ అప్పారావుపంతులుగారు.

ఇది కేవల వచనరూపకము. ఆంధ్రభాషామతల్లికి తలమానికము. కన్యలను వృద్ధులకంటగట్టి వారిమరణకాలమున కెదురుచూచుచు ముల్లెమూటలతోసహా పిల్లనుతమయింట నుంచుకొందమనువారి చరిత్రమిందు పూర్ణముగ వివరింపబడినది. నిరక్షరాస్యుడగు గిరీశంపంతులు డాబుదర్పములు, వెంకటేశమును జేబులోవేసికొని బుచ్చమ్మను వలచి లేవదీసికొని వచ్చుట, అగ్నిహోత్రావధానులు వెంకమ్మగార్ల అమాయికత్వం, సుబ్బమ్మపెండ్లి, విజయనగరం నాటకకంపెనీలో విదూషకపాత్రధరించుకరటకశాస్త్రి కపటకృత్యములు, లుబ్ధావధానులుగారి లుబ్ధత్వము పెండ్లికూతురువేషముతోనున్న కరటకశాస్త్రిశిష్యుని లుబ్ధావధాని డబ్బిచ్చి పెండ్లాడుట రామప్పపంతులు మధురవాణికి దాసుడై యుండి గొప్పయగ్రహారకుడనని చెప్పికొని యామెయెదుటనే పరాభవింపబడుట లుబ్ధావధాని ప్రథమభార్య వితంతుకుమార్తెయగుమీనాక్షమ్మ వ్యభిచారప్రచారము, సౌజన్యారావు, భీమారావు న్యాయవాదుల పరిస్థితులు, పూజారిగవరయ్య వైద్యము మంత్రశాస్త్రము, మధురవాణికి వేశ్యావృత్తి నడపుటలోగల యనన్యసామాన్యచమత్కారము వివరింపబడినది. వెల రు 1—0—0.

# రామదాసు.

గ్రంథకర్త:—బళ్లారి ధర్మవరం గోపాలాచార్యులుగారు

ఆధునికకాలమునందలి యాంధ్రనాటక సమాజములవారి కంఠ అకను ముంగొంగుబంగారమై యున్న రామదాసునాటకమును, అందలి మాధుర్యరసపూరిత కీర్తనలను, నెఱుంగనివారుండరు. మనభాషలోనెన్ని రామదాసునాటకములు రచింపబడినను, రంగస్థలమున బ్రదర్శింపబడునది దిదియొక్కటియే! ఈనాటక ప్రాశస్త్యమును మాటలతో వర్ణింపబూనుట సూర్యుని దీపికతో జూడదలంచుటయే! వెల రు 1—0—0

---

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణబుక్ డిపో, రాజమండ్రి.

# భక్తకుచేల నాటకము



రచయిత:

జొన్నలగడ్డ వేంకట రాధాకృష్ణయ్యగారు.

మొదటికూర్పు 1000 ప్రతులు

ప్రకాశకుడు:

కొండపల్లి వీరవెంకయ్య

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

1935

---

రాజమహేంద్రవరమున

శ్రీరామ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

 [వెల రు. **1—0—0.**

# ఉపోద్ఘాతము

---

“భక్తకుచేల” నాటకమును వ్రాయు కోరిక చిరకాలమునుండి కలిగియు నెప్పటికప్పుడే యేవో యవాంతరములు కలుగుచుండుటచే సంవత్సరమునకుఁ బూర్వమే ఆరంభించియు నింతవఱకుఁ బూర్తి చేయఁ జాలనైతిని. కొన్నిచోట్ల రసభరితములగు భాగవత పద్యములఁ జేర్చితిని. సందర్భానుసారముగా హాస్యరసయుక్తములగు కొన్ని రంగములఁ జేర్చి, పరిదర్శనానుకూలముగ వ్రాయఁబడి, యాంధ్రభాషావధూటీకలంకారముగా సమర్పింపఁబడిన యీ నాటకములోని గుణదోషములను నిర్ణయించు భారము సహృదయులగు పాఠకులకే వదలినాఁడ. దీనిని సాదరముగ గైకొని ప్రకటించిన శ్రీ కొండపల్లి వీరవెంకయ్యగారి కేనెంతయుఁ గృతజ్ఞుఁడ.

రాజమండ్రి,
౨౫—౭—౩౫

బుధజనవిధేయుఁడు,
జొ. వేం. రాధాకృష్ణయ్య.

# హెచ్చరిక

---

ఈనాటకము ప్రదర్శింపఁ గోరువారు, యిందలి పద్యములనుగాని పాటలనుగాని గ్రామఫోను రికార్డులలో పాడగోరువారు, యిందలి కథ సంపూర్ణముగఁగాని, కొంతగాని, టాకీఫిల్ములలో ఉపయోగించుకొనదలచినవారు ముందుగా మాలిఖితపూర్వకమైన యనుమతిఁ గొనవలయును. అట్లు చేయనివారు మానష్టపరిహారమునకు బాత్రులగుదురు.

ప్రకాశకుఁడు.

# పాత్రల వివరము

పురుషులు.

కుచేలుడు:—కథానాయకుడు.

మాధవుడు
రంగడు
కృష్ణుడు
:—కుచేలుని కుమారులు.

సోమశర్మ
దీక్షితులు
వెంకటశాస్త్రి
విష్ణుశర్మ
:—కుచేలుని మిత్రులు.

శంకరశాస్త్రి:—కుచేలునకు యిల్లుయిచ్చిన బ్రాహ్మణుడు.

శ్రీకృష్ణుడు:—ద్వారకాపురీశుడు.

నారదుడు:—దేవముని.

శామి శెట్టి:—సాహుకారు.

నిత్యానందుడు
జ్ఞానానందుడు
:—ఇరువురు ఋషులు.

అతిథులు ముగ్గురు ప్రవేశింతురు.

జయవిజయులు:—శ్రీకృష్ణ సౌధ ద్వారపాలకులు.

కొంకణ, మాగధనృపాలురు, సేవకులు వత్తురు.

స్త్రీలు.

వామాక్షి:—కుచేలుని భార్య, కథానాయిక.

రుక్మిణి
సత్యభామ } :—శ్రీకృష్ణుని భార్యలు.

సుహృల్లత
కనకలత } :—వామాక్షి పరిచారికలు.

రత్నావళి:—శంకరశాస్త్రి భార్య.

---



ఓం

అవిఘ్నమస్తు.

శ్రీరామాయనమః

# భక్తకుచేల నాటకము.

## ప్రథమాంకము.

---

### ప్రథమరంగము.

రత్నపురమున, కుచేలునికుటీరము.

ప్రవేశము:—వామాక్షియు, ముప్వురు కుమారులును.

వామాక్షి:—అక్కటా! కాలవైపరీత్యము. నాథుఁడెంతకష్టపడు చున్నను, నాకరుణానిధియగు ముకుందునకు దయకలుగలేదు కదా! దారిద్ర్యము దుఃఖకారణము. దుస్సహము. దుర్భరము. ఈదారిద్ర్యము ననుభవించుటకంటె మరణించుటమేలు. అనంతమై, అపారమైన యీదారిద్ర్యమునకుదోడు యిరువదియేడ్గురు సంతానము. ఒక్కపూటమైనను పిల్లలకు గడుపునిండ భోజనమిడు నదృష్టమునకు నోచనైతిని. దీనరక్షకుఁడవని, శరణాగత రక్షక బిరుదాంకితుఁడవని, భక్తలోకమెల్ల పొగడుచుండుటవిని, నిక్కమనినమ్మి, నాథునితో నిరంతరము నిన్నుఁగొల్చు మమ్ము

బ్రోవకుండుట భావ్యమా! పరాత్పరా! కరిరాజును బ్రోచిన ఘనుఁడవు. ప్రహ్లాదునిఁగాచిన మాన్యుఁడవు.

సీ॥ విమలభక్తజలజవీధిని జరియించు
భృంగావతంసమా! ప్రేమలేదె
సకలదానవ వధూసౌఖ్య దావానల
మార్పుమేఘుమ దయ మనుపలేదె?
సంసారదుఃఖమర్ణ జలధిని తరియింప
నఁడవంబు చూపవె నుడుపనేత్ర
విమల విజ్ఞానంబు వెదజల్లు నీదృష్టి
పరిసరింపఁజేయవే పద్మనయన!

గీ. ఏను నాగంబు కానొకో! మెల్లజనులు
హేయభావంబునంజూచు హీనకులజ
శబరికానొకొ యేటికీ చలములేని
గతిని విడనాడి రక్షింపు కమలనేత్ర!

[ప్రవేశము:—మాధవుఁడు.]

మాధ:—అమ్మా! ఆఁకలిబాధచే దహింపఁబడుచున్నాను. నిన్న రాత్రి కూడ నాకుఁగడుపునిండుగ నన్నమిడవైతివి. ఇప్పుడైన నఁబెట్టవా?

వామా:—నాయనా! నీకుయీపూట కడుపునిండుగఁ బెట్టెదనులే. నాన్నగారు యిపుడే నీవారధాన్యము గొనివచ్చెదరు. అంతవఱకు నెట్లోవేచియుందుము నాతండ్రీ!

మాధ:—అమ్మా! ఎంతని యోర్చుకొందును. నిన్నరాత్రి నన్ను గంజియైన కడుపార గ్రోలనిచ్చితివికాదు.

వామా:—నాయనా! చిన్నతమ్ముఁడాఁగంజి త్రాగివపిదవనేగదా యేడుపక శయనించినది. పెద్దవాఁడవు నీవేయిట్లనినఁ దమ్ములూఱకుందురా?

మాధ:—అమ్మా! భక్తియుక్తులమై మనము ముకుందుని ప్రార్థించుచున్నాముగదా! అతఁడైన మనల కనికరించడేమి? అతఁడంత కఠినుఁడా?

[ప్రవేశము కుచేలుఁడు.]

అనుబంధము 1.

కుచే:—(నిట్టూర్పువిడిచి) ప్రేయసీ! దురదృష్టవశమున నేఁడు నీవారధాన్యము కొలఁదిగ లభించినవి. ఈ పిల్లలందఱకు నెట్లుసరిపోవునోగదా!

వామా:—నాథా! మీరిందులకై యింతయు విచారింపవలదు. ఈధాన్యముంచి, మీకును బిల్లలకునుబెట్టి, నేనుసాయంకాలమగువఱకు నుపవసింతును.

కుచే:—అట్లుకాదు నాకు ద్రావుటకు గొంచెముదకమిమ్ము. నేను మఱల నరణ్యమునకుఁబోయి వచ్చెదను. హేకృష్ణా! పరమభాగవతాగ్రేసరుఁడవు. నాయెడ నీకింత యనాదరమా? ఇంతచలమా? నాదారిద్ర్యము నేలబాపవు?

చ. కనికరమింతలేదె కులకాంతల బాధల జాలిచెందవో
తనయులు దుఃఖమొంద వనితాహృదయంబెటు కాలిపోవునే
వనజశరాప్త నీకెఱుకవచ్చెనె దీనుల బ్రోవవేని నీ
కనికరమేల యోగులను గాచుటకే తగియుండు ప్రేమయా?

వామా:—ప్రాణేశ్వరా! ఆప్తరాత్పరునకు మనపై నెన్నటికైన కరుణ కలుగకమానదు. ఓరిమిగలిగి యుండవలెను. ఓరిమియే యెల్లరకును శ్రేయము.

గీ. ఘోరదారిద్ర్య సంతాప భారమునను
క్రుంగఁ గాంచిన నిజప్రాణ భంగమగును
ఓర్మి యేకరణి శ్రేయమా నుర్వి లోన
కాంచి చూడఁగ నిజము ప్రాణేశమనకు.

[ప్రవేశము సోమశర్మ.]

సోమ:—ఏమోయి కుచేల! నేఁడు పురాణపఠనము లేదా? వేంకట శాస్త్రియు, దీక్షితులును కూడ బయలుదేఱినారు.

కుచే:—(స్వగతము) భగవత్కథాశ్రవణ కుతూహలాయత్త చిత్తులై, యాద్విజోత్తము లరుదెంచుచున్నారు. నీవారధాన్యమున కిపు డేమితొందర? కొంతసేపు, ఆరమానాథుని దివ్యకథామృతపానం బొనరించి, యావల కాననమునకు బోనగును.

[వేంకటశాస్త్రి, దీక్షితులు, విష్ణుశర్మాదులు ప్రవేశము.]

కుచే:—ఈకృష్ణాజినముపై నాసీనులుకండు. (భాగవతములోని గజేంద్ర మోక్షణ కథను జదువును.)

"ఉ. సిరికిఁ జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్కనొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై."

ఆహా! ఆదయామయుని, ఆయప్రమేయ ప్రభావభావనాతీతుని, ఆలీలా మానుష విగ్రహుని, ఆయనంతకోటి లీలావిలాసభాసురుని, ఆసురుచిర కౌస్తుభాలంకృతుని, ఆయిందిరామనోనాథుని యావేదనము? ఆహా! వర్ణింపఁజాలము........

[ప్రవేశము:—శంకరశాస్త్రి]

శంక:—ఏమయ్యా కుచేలా! నీభాగవత కథా శ్రవణానందమేగాని, మావంక కన్నెత్తి చూచుట లేదా? నేనిచ్చటకువచ్చి పావు గంటకుఁ బైగాన్పైనది. ఎంతసేపైన భక్తి, భక్తి యని దేవు లాఁటయేగాని మాకీయవలసిన యద్దెపైక మెన్నాళ్లకునీయవా? ఈయఁదలఁచుకోలేదా? ఈయుననిగాని, యీయనక్కఱ లేదని గాని యొకసారియనుము. వదలిపై చెదను. లేనిచో నన్నాళ్లిట్లు బాధపెట్టెదవు?

సోమశర్మ:—ఏమయ్యా శాస్త్రీ! ఇంతలోనే యంత తొందర యెందు లకు? అద్దె యీయవలసిన యెడల నొకటి రెండురోజు లాల స్యములో యిచ్చెదరుగాని, యసలే యీయక యెగఁబెట్టెదరా?

దీక్షి:—దయాదాక్షిణ్యము లించుకైన నుండవలదా? ఈయద్దెలవలననే జీవించుచున్నట్లు మాట్లాడెదవేమి? ఆగర్భశ్రీమంతుఁడవుగదా? ఒక పేదపాఱున కీకుటీర ముచితముగ నొసంగినచో బావ మొదవునా?

శంకర:—మీకేమి? కబుర్లు చెప్పుటయేగాని, కార్యాచరణమునఁ బస యింతయును లేదు. అంత యభిమాన మున్నవారలు మీరేల పేదపాఱుఁడని కనికరించి యొక గృహము నేల కట్టించి యీయ రాదు? శ్రీమంతుఁడైనచో నింటి నూరికే యీయవలెనను నియమ మెందైన నున్నదా? కుచేలుఁడేమి కుంటివాఁడా, గ్రుడ్డివాఁడా, దానధర్మములు చేయుటకు? ఊరిలో గృహములు, సౌధములు, కల భాగ్యశాలు రందఱును బీదల కుచితముగనే నివసింప గృహ ముల నిచ్చుచున్నారా? ఎందుకు లేనిపోని మాటలు? ఈపురాణ పఠనమేల? ఈ శ్రీరంగనీతు లెందులకు? కష్టపడి యేయుద్యోగ

మైనఁ జేసికొని జీవింపఁగూడదా? లౌక్యవృత్తి చే ధనమార్జించుట తగదా? ఏరాజు కడనైన నూడిగము చేసి, పొట్టపోసికొనరాదా? ఇంటిలో నున్నది కడుపార మెసవి, పురాణశ్రవణమునకు వచ్చి నారుగాని, కుచేలుని కుటుంబమునకుపట్టుమని పదిరోజులు సరిపోవు ధాన్యము నిచ్చిన పాపమునఁ బోలేదే? ఏమోయి కుచేలా! సమాధానము చెప్పక మిడిగ్రుడ్లు పెట్టుకొని, యట్లు చూచెద వేమి? ఎప్పుడిచ్చెదవు?

కుచే:—సోదరా! ఆగ్రహింపకుము. కూర్చుండుము. ఆశ్రీమన్నారాయణుని, ఆజగదేకవల్లభుని, ఆవిమలకమనీయవదనారవిందుని దివ్యకథా శ్రవణమునఁ దరింతువుగాని రమ్ము. ఆలక్ష్మీకాంతుని భక్తపరి పాలనదక్షతను గాంతువుగాని రమ్ము.

సీ. శ్రీనాథు దయగల్గ చిత్తజదుఃఖముల్
రూపుమాపై పోవు లోకమందు
మానవుం డండయై మనల రక్షించిన
సకలకష్టంబులు సమసిపోవు
దైత్యారి రక్షింపఁ దలఁచి హస్తము చాప
నరకంబె స్వర్గమై వరలు నెపుడు
శ్రీకృష్ణుఁడే తన చిన్మయరూపంబు
చూపింప నార్తులు సొలసిపోవు

గీ. సకలసౌఖ్యంబు లబ్బును సర్వదుఃఖ
జలధులింకును పుణ్యసంచయము కల్గు
వాయునందన భీష్మాది భక్తవరులు
దాస్యమొనరింత్రు శ్రీకృష్ణధామమందు.

శంకర:—నీకు భక్తి యెన్నటికినిఁ గూడు పెట్టదు. నీకేగాదు; లోకములో నెవ్వరికినిఁ దిండి పెట్టదు. నీకు పలుపర్యాయములు, 'భక్తి' ని విడువుమని హితము చెప్పియుంటిని. నాహితోక్తులు నీకు విషప్రాయములైనపుడు నిన్ను నేనే కాదు; యాపరమాత్ముండైన బాగుచేయలేఁడు. రమ్ము నీకు చైద్యరాజేంద్రునికడగాని, మాగదాధిపుని యాస్థానమునఁగాని, యుద్యోగ మిప్పింతును. ఎందుకీ దారిద్ర్య మనుభవింతువు. పిల్లల నేల మల మల మాడ్తువు? ఏప్రభువునైన నాశ్రయించి, సుఖంపుము. ఎందులకీ దుఃఖము.

కుచే:—నేను సుఖని గాకపోలేదు. ఆరమానాధుఁడే నాప్రభువు. నాకితర ప్రభువులతో నిమిత్తము లేదు. నన్ను రక్షించినను, శిక్షించినను, ఆజగన్నాటక సూత్రధారియే. ఆతఁడే నాతండ్రి. అతఁడే నాదైవము. నాసర్వస్వము నతఁడే.

చ. ధనమునుగోరువారికి సుధాకర వక్త్రులఁజేరువారికిన్
వనజశరార్తి కష్టముల బొల్పడువారికి పేరుపొందగా
మనమునగోరువారికిని మాన్యము భూపులవేడి దాస్యమున్
గొనగ ముకుందపాదములకున్ గడుదూరముగా నివసించుచుండుటన్.

శంక:—సరే. నీసర్వస్వమునతఁడే. నాసొమ్ము తే పీవేళకీయనివో, రాజభటుల సాహాయ్యమున నింటినుండి వెడలగొట్టింతును. తెలిసినదా? ఏప్రభుఁడునిన్ను రక్షింపనేతెంచునో చూచెదగాక.

(నిష్క్రమణ)

సోమ:—దుర్మార్గుఁడు.

దీక్షి:—కర్కశుఁడు. మానవరూపముననున్న బ్రహ్మరాక్షసుఁడు, పరమలోభి.

విష్ణు:—చేదినగరాధీశుఁడు, మాగదాధిపతుల యాశ్రయగర్వముతప్ప మఱేమియు లేదు. రాజానుగ్రహ గర్వితమతియగు నీతఁడు మన కుచేలున కేమైన యపకృతి ఘటిల్లఁజేయునేమోయని నాభయము.

సోమ:—వానిమొగము. కుచేలా! నిర్మలాత్ముఁడవై భగవన్నుతి సేయుచు, మమ్ముద్ధరింపఁజేయు నిన్నితఁ డవమానించి సుఖించునా? నేఁటికి బురాణపఠన మాపుచేయుదము.

దీక్షి:—ఎంత గర్వమున్న నేమి? ఎంత యైశ్వర్యమున్న నేమి? రెండు పెండ్లిండ్లు, వ్యర్థముకాఁగా, మఱల తృతీయ వివాహపు భార్య కాపురమునకు వచ్చినది. ముసలిమగఁడు, పడుచుబెండ్లాము ముచ్చట బాగుగానున్నది.

కుచే:—మిత్రులారా! మీకోరిక ననుసరించి, పురాణపఠనము నేఁటి కాపుచేయుదము. శంకరశాస్త్రిని మనము నిందించవలదు. ఏదిజరిగినను విధి ననుసరించియే జరిగి తీఱును. అన్నిఁటికిని యాసర్వేశ్వరుడే శరణము. సంతోషము, దుఃఖము మనుజులకు సమానముగనే యుండును.

గీ. ఒకఁడు తిట్టిన దుఃఖమ్ము నొందుటయును
నొకఁడు భూషింప సంతోష మొందుటయును
దూష్యమా నిల సంతోష దుఃఖములవి
మానవాళికి సహజమై మహిని వెలయు.

[అందఱు నిష్క్రమింతురు.]

## ద్వి తీ య రం గ ము.

---

[ప్రవేశము—వామాక్షి, కుమారులు.]

వామాక్షి ధాన్యము దంపుచుండును.

వామా—నాచిన్నతండ్రీ! ఇప్పుడే నీకు భోజన మిడెదను. అంతవఱకు నల్లరి సేయక శయనించి యుండుము రా. అల్లరి చేసినచో బూచివాఁ డెత్తుకొని పోవును సుమా!

[రత్నావళి ప్రవేశించును.]

వామా:—రత్నావళీ! కూర్చుండుము.

రత్నా:—(కూర్చుండి) వామాక్షీ! ఇంకను వంట పూర్తి కాలేదా?

వామా:—లేదు. నీవారధాన్యము దంపుట యిప్పటికిఁ బూర్తియైనది. పిల్ల లాకటిబాధకుఁ దాళఁజాలకున్నారు. నీవంట పూర్తియై, భోజనములు కూడ ముగించినట్లున్నది.

రత్నా:—ఏమో నాకు బద్ధకముగా నున్నందున మాయాయనయే వండుచున్నారు.

వామా—అయ్యో! ఎంతపాపమమ్మా! మగనిచే వంటచేయించుకొను మగువ లెందైన గలరా?

రత్నా:—అదేమమ్మా! అట్లనెదవు? నేనింకను మంచిమాటలఁ జెప్పి, యాయనచే బనులు చేయించు కొనుచున్నానుగాని, యనేకులు తమ పతులను నిర్బంధించి, దాస్యము చేయించు కొనుచున్నారు. నీకుఁ దెలియునో లేదో, పుల్లమ్మ తనకుఁ గావలసిన నగలఁ జేయించలేదని భర్తతోఁ బోరాడి పుట్టింటికి వెడలి పోయినది. రంగనాయకి కుమార్తె సుందరి తనకుఁ బెండ్లి యసలే యక్కఱ

లేదనియు, చదువు కొందుననియుఁ బట్టు పట్టుచున్నదట. రామశాస్త్రి తనయ జానకికి రజస్వలానంతర వివాహము చేయనున్నాడట. ఈవిధముగా నవనాగరికతా విలాసములు దినదినమునకు శీఘ్రాభివృద్ధి నొందుచుండ నీవేమో యింకను బూర్వకాలపు పలుకుల నాడుచున్నావు.

వామా:—లోకమంతయు ధర్మవిరుద్ధమై పోవుచున్నది. నీకును నాకును జిరకాలమునుండి మైత్రికలదు కావుననేఁ జెప్పుచున్నాను. పతియాజ్ఞానుసారము ప్రవర్తించుట సతికి విధిహితము. భర్తను దైవము తో సమానముగా భావించి, పూజించుట సాధ్వీలక్షణము.

రత్నా:—నీ శ్రీరంగనీతుల కేమి? నీవు మాత్రము శరీరమున నస్వస్థవై యున్నపుడు మగనిచేఁ జాకిరీ చేయించుకొనవా? అందఱవంటి వారముకామా? భర్తను ధనము సంపాదించుకొని రమ్మనుట కూడ పాపముకాదా?

వామా:—అది పాతకముకాదు శక్తియున్నంతలోఁ గష్టపడి యెంతో యింత యింటికిఁ గొనివచ్చుట భర్తవిధి. అది వండి సుఖమైన భోజనము పతికిడి, తాను భుక్తశేషము స్వీకరించుట భార్యవిధి. అంతేగాని, శరీర మస్వస్థముగ నున్నదనియో, భర్త బలముగా, యారోగ్యముగా నున్నఁడని యసూయ చెందియో, జాకిరీ చేయించు కొనుట మహాపాపము. సతీధర్మములు విద్యావతివి, వివేకవతివి నగు నీకు నే బోధింపవలయునా?

చ. పతిసదయాత్ముఁడైన కడుభాగ్య విహీనత జెందియున్న
యతులిత రూపవంతుడైన న్మతిపూదయులేని కురూపియైన
గతియతఁడేయటంచు నెడగాంచి మెలంగుట శ్రేయమౌగదా
పతియిహదైవతమ్ము పరభావము నొందగబోకు నెచ్చెలీ.

లోక మెట్లుండిన మన కేల? పతియే మన కేడుగడ. పతియే మన కిల సర్వస్వము. ఆతని సన్నిధియే మనకు మహదానంద ప్రదము. భర్త కెన్నఁడును భార్యవ్యతిరేకము చెప్పఁ గూడదు.

రత్నా:—వామాక్షీ! నీవాదము సమంజసముగా లేదు. భార్యాభర్తలనుకూలముగ నున్న నే యాకాపురము, దాంపత్యము సలక్షణముగ నుండును గాని లేనిచో నది నిరయసంకాశమే. ఇరువురు సుందరముగ నుండవలయును. అది గాక, భర్త భాగ్యశాలియై యున్నగాని, భార్య కనురాగముండదు. భర్త యందముగనున్న గాని భార్య హృదయమున కానందము, సౌఖ్యము నుండవు.

వామా:—అయ్యో! వెఱ్ఱిదానా! పతివ్రతయగు కాంతకు భర్త యందచందములతో నేమిపని. భర్త కురూపియై యందవికారముగ నున్నను, ధనహీనుఁడై దుర్భర దారిద్ర్య పీడితుఁడై యున్నను, భార్య తన పూర్వజన్మార్జిత సుకృత దుష్కృత ఫలమని భావించి, యాఱటచెంది, యతఁడే దైవమని, మన్మధుఁడని తలంచి యుపచరింపవలయును గాని యన్యథా తలంపరాదు.

గీ. పతికురూపియునైన నిర్భాగ్యుఁడైన
పరమ లోభియునైన నప్రతిభుఁడైన
తనదు కర్మఫలంబంచు ధరణిలోన
తలఁచి, పూజింపవలయునో లలన! సతులు.

[కుచేలుఁడు ప్రవేశించును.]

వామా:—(పాదములు కడగి, జలము శిరస్సుపైఁ జల్లుకొని) నాధా! శ్రమపడి వచ్చినారు. ఇంచుకసేపు విశ్రమింపుఁడు పాదము లొత్తెదను. (పాదము లొత్తును)

రత్నా:—వామాక్షీ! నేను పోయివచ్చెదను. (వెడలును)

కుచే:—ప్రాణేశ్వరీ! ఉపవాస కృశీభూతవయ్యు నా కుపచారములు సల్పుచున్న నీవతి పదసేవానురక్తి నెంతని కొనియాడుదును. ఈదారిద్ర్యమే కాకుండ, నీయిరువదియేడ్గురు పిల్లలకును నుపచారములు సల్పుటతో నీకాయము శుష్కించిపోయినది. నిద్దంపు టద్దంబులఁ బోలిన నీచెక్కిళులును కాంతిదొఱంగి యున్నవి. మన మెన్నాళ్లీ తీరున దురదృష్టవంతులమై, దుస్సహంబైన దారిద్ర్యానలంబునఁ బడి మ్రగ్గవలయునో తెలియకున్నది. ఆ సకలనిగమాగమవేదవిదుండగు నా శ్రీహరికి మనపై నెన్నఁడు కృపఁ గలుగునో కదా!

చ. తినుటకుఁ దిండిలేదు వనితామణి క్రుంగెడి నీరసంబుచే
తనయులు దుఃఖవారిధిని దాట జవంబు నశింప పీన్గునై
మనుటయె సందియంబగుట మాతృసుఖంబును మాపివేయుచుం
జనకుని కష్టకష్టములు చయ్యన నిచ్చెదరయ్య మాధవా!

నేనిపుడు తెచ్చిన నీవారధాన్యమును గూడ దంచి, భోజనము సిద్ధముచేయుము. కొంతసేపా రమాకాంతుని స్మరించుకొందును.

వామా:—చిత్తము.

[తెరపడును.]



ఓం

అవిఘ్నమస్తు.

శ్రీరామాయనమః

# భక్తకుచేల నాటకము.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

ప్రదేశము:—ద్వారకలో శ్రీకృష్ణుని యంతఃపురము.

[ప్రవేశము— శ్రీకృష్ణుఁడు, రుక్మిణి, సత్యభామ.]

అనుబంధము 2

శ్రీకృ:—సతీమణులార! ఇఁకనైన నామాటవిని శాంతింపుఁడు. మీ మీ వాదముల వినినపిదప యెట్లుసత్యము నిర్ధారణ చేయుట కును నాకుఁదోఁచకున్నది. ఒకరివాదము సమంజస మనినచో మఱొకరికిఁ దప్పక క్రోధముజనించునుగదా!

సత్య:—నాపై మీకెన్నఁడును ప్రేమలేదని నేనెఱుఁగనా? మీ ప్రేమ భాజన యీ రుక్మిణిగమే. ఆమెవాదమే సహేతుకమనుఁడు.

శ్రీకృ:—సత్యా! అట్లు నిష్ఠూరముగ సంభాషింపనగునా? నాకు మీ రిరువురునుగూడ ప్రాణసమానలే.

గీ. ప్రణయ సామ్రాజ్యమునకీరు పట్టభద్ర
లయ్యు నీయెడ కలహింపనగునె? నాదు
ప్రేమ నిర్వురు సమముగా భామలార
పంచుకొనినార లౌర మీభాగ్యమేమొ?

ఇరువురును మత్ప్రణయ సామ్రాజ్యపట్టభద్రలే. ఇరువురును నాకుఁబ్రీతిఁ గూర్పుప్రాణసఖులే. మీరలు నారెండునయనములునై వెలయుచున్నారు. ఇట్టియెడ నేదోయొక చిన్నయంశమునకై కలహమును బెంచుకొనుట యుక్తమైన కార్యమగునా? ఎవరైన వినిన నపహసింపరా? వైదర్భి! నీవైన నామాట పాటింపవా?

రుక్మి:—నాథా! మీ పలుకు నెన్నఁడైన జవదాటి మెలఁగుదునా? నేనేమి తప్పుమాట నాడితిని? మానవునకు వైరాగ్యమే మోక్షము నొసఁగునంటిని. భక్తియే వైరాగ్యసాధమునకుఁ బ్రథమ సోపానమంటిని. సంపద లశాశ్వితములని, తుచ్ఛములైన వైహికభోగములు మనుజుని నిరయకూపమునఁ బడవైచునని పల్కితిని.

సీ. ధనము కల్గిననాఁడు దయలేక క్రూరుఁడై
పరుల హింసించుచు పాపపథము
ద్రొక్కి దుర్మార్గులతో చరించుచునెప్డు
శ్రీరమాధవు నామ శ్రీనివిడిచి
నీప్రపంచకమే నిత్య మెల్లభాగ్యంబులు
శాశ్వతంబులటంచు సతతమెంచి
సాధుపుంగవ సేవ శాస్త్రపఠన రతి
మాని యమ్యులనులోప మల్పమైన

గీ. చాటి సంతోషమొంది ప్రశస్తపథముఁ
ద్రొక్కుచుంటినని యను లోకభీతి
విడిచి, మృత్యువు దరిజేర వెట్టులట్లు
నిన్ను చింతింత్రు వ్యర్థంబు నీరజాక్షి!

శ్రీకృ:—విదర్భరాజపుత్రీ! నీవు వచించినది నిక్కువము కాదనఁ జాలను.

సత్య:—అట్లయిన నేనాడినది యసత్యమగునా? భక్తి వైరాగ్యములు మనుజుల కాదినుండియు నెట్లలవడును? పూర్వులేగదా యాశ్రమముల నాల్గింటి నేర్పఱచిరి. అందు గార్హస్థ్యమే యుత్తమోత్తమమని వాక్రుచ్చిరి. గార్హస్థ్యము ననుభవించుటకు సంపదైశ్వర్యములుండవలదా? "భక్తి బరుఁగ్రిమనిన నెత్తిచుట్టుమనిన" దట. అట్లున్నది మీప్రాణేశ్వరి వాదము. కొంతకాలము పురుషుఁడు భార్యాపుత్రులతో నైశ్వర్యభోగాదు లనుభవించి యటు పిమ్మటనే మోక్షమార్గము నన్వేషింపవలయును. సంపదలేని వాని జీవనమొక జీవనమేయగునా?

సీ. ప్రజలెల్ల తను గూడి బ్రహ్మాండముగ మెచ్చ
లక్ష్మిప్రసన్నమే, రామవలయు
పండితుల్ కవులెల్ల పద్యముల్ మెచ్చగా
లక్ష్మి ప్రసన్నమే! రామ! వలయు
సౌందర్యవతి భార్య సరసనుండగ నెప్డు
లక్ష్మి ప్రసన్నమే! రామ! వలయు
బంధుగుల్ ముదమొంద బహుజనుల్ తనివొంద
లక్ష్మి ప్రసన్నమే! రామ! వలయు

గీ. ధనమె లేకున్న బందుగుల్ దరికిరారు
ధనమె లేకున్న కర్మల దలపలేము
ధనమె లేకున్న సాధుల దర్శనంబు
కల్గదెన్నఁడు ధనమె ముఖ్యంబు రామ.

రుక్మి:—అట్లయినఁ జెల్లెలా! ఒకమాట నడిగెదను కోపింపక సదుత్తర మొసఁగుము. ఐశ్వర్యమువలన తృప్తి యొదవునా? ఆశ దురాశగా పరిణమింపదా? వసిష్ఠ, విశ్వామిత్ర, గౌతమాగస్త్యాదిమహాముని పుంగవులు నిరాహారులై యహోరాత్రములు ఘోరకాంతార సీమలందు తపోనిరూఢి నాదేవదేవు నర్చించి, మోక్షసామ్రా జ్యాధి నాధులు కాఁజూతురేల? సంకల్పమాత్రమున వారైశ్వ ర్యమునందగలరే? శుష్కాంగులై వారలు తప మొనరించుట కేవలము నిరర్థకప్రయత్నమే యగునా?

గీ. భక్తియేగాని ప్రేమ యెప్పటికిఁ గూడ
ముక్తి నొసఁగదు నిక్కమో ముగుద వినుము
అరయ కాంతారసీమల నహరహమ్ము
తపము నేల యొనర్తురో తరుణి చెపుమ.

ఏమినాధా! అట్లూరక చూచెదరేల? ప్రత్యుత్తరమిమ్ము.

సత్య:—నాధా! నాకు నేఁడు తగిన వంచనఁ గావించితివి. నీవు సమా ధానము చెప్పవేమి? భక్తి వైరాగ్యములే నిక్కముగా మోక్ష కారణము లగునేని, యానారదమునీంద్రుని పల్కులు రిత్తయై నట్లేనా? అజగడాల చీలిని రానిమ్ము. ప్రేమయు, నైశ్వర్యము మాత్రమే మోక్షదాయకములని చెప్పి, నమ్మించెనే. ప్రాణే శ్వరా! నీవు చెప్పుము.

గీ. ప్రణయ మైశ్వర్యమును గూడ ప్రాణనాథ
ముక్తి నిచ్చు నిటంచు నమ్మని వచించె
సత్యమెద్దియొ వచియించి సత్వరముగ
శాంతి కల్గింపవేల హృదంతరమున?

శ్రీకృ:—సత్యా! వైదర్భీ! మీయిరువురి తగవులును దీర్చుటకు నేను సమర్థుఁడ గాను. నాయుద్దేశ్యము భక్తి వైరాగ్యములే—

సత్య:— ఆ!! ఆ!! నాథా! నాప్రేమ యింతియే యగునా? లోకము ప్రేమమయమని, ప్రకృతి ప్రేమమయమని, సర్వము ప్రేమ మయమేనని యీవు నాతో నెన్నిమాఱులు పలికి యుండలేదు. ఇంతలోనె నీయభిప్రాయము మార్చుకొందువా? ఇది నాపా పమా? అవును. నన్నేడ్పించుట నీకానందము.

గీ. జగతి ప్రేమమయంబని చాలసార్లు
చెప్పి, నమ్మించి, యిపుడిట్లు చేయనగునె?
మనసు కల్గిననొకమాట మనసు లేని
యప్పుడొకమాట నాడగానగునె నాథ.

అ ను బం ధ ము 3

శ్రీకృ:—సత్యా! అదిగో! సమయమునకు త్రిలోకవంద్యుఁడగు యీ నారదఋషీంద్రుఁడే విచ్చేయుచున్నాఁడు.

[నారదుఁడు ప్రవేశము.]

అ ను బం ధ ము 4

నార:—(ప్రవేశింపగనే శ్రీకృష్ణాదులు నమస్కరింతురు.)

శ్రీకృ:—సంయమీంద్రా! అయ్యాసనమధిష్టింపుము. త్రిలోకసంచారి వగుట నీరాక మాకెంతయు ముదావహము. విశేషము లేమైనఁ జెప్పవా?

నార:—సకల లోకాతీతుడవు. సర్వలోకైకపూజ్యుడవు. నీకు విశేషములనేఁజెప్పువాడనా? భక్తి ప్రేమమూర్తులగు రుక్మిణీ సత్యభామల వదనారవింద విలోకనమున నిచ్చట నేదోయొక కలహారంభమైన సూచనలు పొడగట్టుచున్నవి. సాత్రాజితీదేవీ! ఏమైన జరిగినదా?

సత్య:—నారదమునీంద్రా! నీపలుకులవిశ్వసించి, మోసపోతిని. ప్రేమ భాగ్యములే తారకమని చెప్పియుండలేదా? నాథుఁడు తుదకు భక్తివైరాగ్యములే యుత్తమోత్తమములని స్థిరీకరించెను. నాథుఁడు తుదకు నన్ను వంచించెను. ఇందులకు దగిన సమాధానముచెప్పుము.

నార:—అమ్మా! సత్యాదేవీ! శాంతింపుము. నేను నీతో నసత్యముఁ బలకలేదు. నీవానాఁడు నన్ను ప్రేమభాగ్యములను గూర్చి యడిగితివేగాని, భక్తి వైరాగ్యములఁ గూర్చి ప్రశ్నింపలేదు. లోకము సమస్తము ప్రేమమయుడని, రమణీయమై, నేత్రపర్వమొనరించు ప్రకృతిప్రేమమయమని, సకలలోకాధినాథుఁడగు నీమనోహరుఁడు ప్రేమైకమూర్తి యని నుడివితిని గాని ప్రేమకంటె భక్తి యధికమని చెప్పియుండలేదు. రెంటికిని సంబంధము లేదు. నీకు ప్రేమ యాదర్శము. రుక్మిణీ దేవికి భక్తి యాదర్శము. ప్రేమవలన మోక్షము లభించుట కల్ల. మానవులు భక్తి వలననే వైకుంఠమును జేరగలరు.

ఉ. మాధవసేవ, సజ్జనుల మాన్యపదంబులగొల్వ యాత్రలన్
సాధుజనాళి దర్శనము శాస్త్రపథంబుల గుర్తుపట్టుటల్
భూధవసేవఁ బోవిడుట భూరి సుఖంబుల గోరకుండుటన్
శ్రీధవు నెల్లవేళలను చిత్తమునన్ దలపోయు టొప్పగున్.

కృష్ణా! వేదవేదాంత వేద్యుఁడవు. నీవే రుక్మిణీ సాత్రాజితీనందనల వాద
ములం దేది సహేతుకమో నిర్ధరింపవలయును.
సత్య:—నారదా! భక్తులలో నెవ్వరైశ్వర్య భోగాదు లనుభవించు
చున్నారు? ఐశ్వర్యముండిన గదా దానధర్మము లొనర్చి, క్రతు
వులొనర్చి, పుణ్యలోకమును జేరుట. భక్తిచే ముక్తికాంతను
జేపట్టుట సత్యమో యసత్యమోగాని, ముందు దారిద్ర్యకాంతా
కరగ్రహణ యోగము సిద్ధించును.
నార:—నిజమే. సాత్రాజితీదేవీ! నీవువచించినదిసత్యము. శ్రీకృష్ణపద
సేవానురక్తుఁడగు కుచేలుఁడు దుర్భరదారిద్ర్యము ననుభవించు
చుండుటలేదా? భక్తుఁడైన ప్రహ్లాదుఁడెన్నియిడుమలఁగుడిచినాడు.

సీ. ఉదధిలోఁద్రోయింప నొల్లకహరివీడ
ప్రహ్లాదుఁడెప్పుడు భక్తి వేడె?
విషమివ్వఁగోలగా వెఱపింతలేకయే
త్రాగిప్రహ్లాదుండు ధన్యుఁడవడె?
మత్తేభయూథంబు మాధవుస్మరియించు
ప్రహ్లాదు త్రొక్కఁగ వచ్చినపుడు
కొంకు జంకును లేక గోవిందుధ్యానించి
ధన్యుఁడై భక్తులఁ దనుపలేదె?
గీ. రాక్షసుని పుత్రుఁడై యుండి రాక్షసాంత
కుని నిరంతరమున్గొల్చి గుణవిరహిత
దశనుఁబొందడె? యాత డాదర్శకుండు
భక్తులకు వాని మార్గంబె పరమపదము.

సత్య:—నారద సంయమీంద్రా! అట్లయిన నొక్కసారి యాకుచేలుని
కడకరిగి, భక్తియోగము మోక్షదాయకముకాదనియు, నైశ్వ
ర్యమే తారకమని బోధించిరండు.

నార:—అందులకభ్యంతరములేదుగాని, నేను కలహనారదుఁడనని యీా వఱకే చతుర్దశభువన ప్రఖ్యాతినిగాంచియున్నాను. నే నాభక్తా గ్రగణ్యుని యభిప్రాయము మార్పగలుగుదునో లేదోయని భయముగానున్నది.

రుక్మి:—నారదమునీంద్ర! నీ వాప్రయత్నమున గృతకృత్యుఁడవు కాఁగలవుసుమా.

సత్య—నారదయోగీంద్రా! నాకొఱకుఁ గష్టపడి, యాభక్తుని యెవ్విధముననైన నైశ్వర్యకాముని గొనరించితేని నీకు నే నాజన్మాంతము కృతజ్ఞనైయుందును. ఇవిగో నాయేడు వారముల నగలలో నొక వారము నగలు అవసరమున్నయెడల వీని నెవ్వరికైన యిచ్చియైనను కార్యసాఫల్యముఁ గాంచుము.

శ్రీకృ:—నారదా! గురుతర కార్యభారమును శిరముపై నిడికొంటివి. ఎవరి వాదము నెగ్గింతువో—

రుక్మి:—ఏమి యోగీంద్రా!

నార—తల్లీ! నీవాక్యము లమోఘములు. ఓపూతచరిత్రా! నీకేను జెప్పవలసిన దెద్దియులేదు. భక్తిని మించిన వస్తువెందును గానరాదు. వేయేల. నీమనోనాథుఁ డీరమాకాంతుఁడు భక్తి చేఁగాని, తదన్యముచే సాధ్యపడునా? తులాభారవృత్తాంతమును మఱచితివా?

గీ. భక్తిచేతనె ప్రహ్లాద భక్తుఁ డహహ
నీదునాథుని బంధించె నెలత యపుడె
మఱచినావో తులాభార మహిమ మీావు
ముక్తి నిచ్చెడి వస్తువు భక్తి యొకటె.

సత్య—అట్లయిన ప్రేమ—

నార:—సత్యాదేవి! ప్రేమమాహాత్మ్య మగణ్యము. ప్రేమకొఱకు జగములు తలకిందగును.

గీ. భక్తి పరమాత్ము కరుణను బడయఁ జేయు
గాని ప్రేమయు లోక లోకాలనెల్ల
తల్లక్రిందుగఁ జేయు నిద్ధరణిలోన
యెంద అసువులు గోల్పోయి రిందువదన!

నేనుపోయి వత్తును. (పాడుకొనుచు పోవును.)

తెఱపడును.

---

ద్వితీయ రంగము.

---

ప్రదేశము:—రత్నపురము.

[నారదుఁడు ప్రవేశించును.]

అనుబంధము 5.

నార:—జగత్కల్యాణమూర్తియగు శ్రీకృష్ణభగవానుని లీలావిశేషము లత్యాశ్చర్యజనకములు. అమితానందసంధాయకములు. ఆజగదారాధ్యునిలీలావిశేషమే యిపుడు జరుగుచున్న రుక్మిణీ సత్యభామావివాదము. ఆతను భక్తిప్రేమలకుగల యపారభేదమును దెలియజేయుచున్నాడు. ఆతడు సూత్రధారి. నేనొక నటుడనై యీనాటకము నాడింపవలయును. ఇంతకును సత్యాదేవికి గర్వభంగము తథ్యము. గాని యీవిషమపరీక్షలో గుచేలుఁ డేమగునో చూడవలసియున్నది. ఇందులకే నే నిపుడు రత్నావళితో సంభాషింతును. ఆమెహృదయమున లవమాత్రమైన భక్తి లేదు. భర్తమాటవినుటయే తప్పని యభిప్రాయపడును. ఎంతసేపును నాభరణములమీఁది యాశయేగాని, యన్యవిషయమూమె చిత్తమున జొరదు. ఆమెకు సత్యాదేవియొసఁగిన యీరత్న

హారమునిచ్చి కుచేలునిచిత్తము నెట్లయిన భక్తిపథమునుండి తొలగునట్లుచేయుమనెదను. ఇదే యాపెగృహము. రత్నావళీ! రత్నావళీ !

రత్నా:—(తలుపుదెఱచి) సంయమీంద్రా ! నమస్కారము రండు.

నార:—అభీష్టసిద్ధిరస్తు. రత్నావళీ ! నీనాథుఁ డెందేగె?

రత్నా:—ఊరిలోనికిఁబోయియుండును. యోగీశ్వరా! తామాగతానాగతవేదులు. నాకు యీకాపురమేమియు నానందదాయకముగ లేదు. నాయాదర్శములకు దగినభర్త నాకులభించలేదు. స్వేచ్ఛావిహారము నాయాశయము. నాపతి నిర్బంధమువలన జీవితము శూన్యముగ దోచుచున్నది. ఆనందములేని యీసంసారమువలన ప్రయోజనమేమి? స్వేచ్ఛలేని జీవితమునాకేల? ఒక్కయాభరణమైనధరించి యానందించు భాగ్యమునకు నోచనైతిని. దయయుంచి నాకోరిక తీరికలెత్తుమార్గ మేదైనఁ దెలిపి నన్నుదరింప జేయుడు.

నార:—కామినీమణీ! అట్లయిన నీకొక్క యుపాయముఁ జెప్పెద నాలకింపుము. పొరుగింటి కుచేలు నెఱుఁగుదువుగదా! అతఁడు భక్తి భక్తి యని దేవులాడుచుండుట కూడ నీకుఁ దెలియని విషయముకాదు.

రత్నా:—భక్తి భక్తి యనుచున్నాఁడు కావుననే తిండికి గూడ లేక యేడ్చుచున్నాఁడు. ఇరువదియేడ్గురు పిల్లలతోఁ బూటకైన గతి లేక యల్లాడుచున్నాఁడు.

నార:—నాకొక్క యుపకారము చేయు నెడల నీయభీష్టసిద్ధియగు మంత్ర ముపదేశింతును.

రత్నా:—మహాత్మా! అట్టి మంత్రమో, తంత్రమో, మరేదైన యంత్రమో నాకు దయచేసి నన్ను దరింపఁజేయుడు.

నార—నేను నీకుఁ బిత్రుసమానుఁడను. నాతో మనసులోనున్నది చెప్పుము. నీకీభర్తయెడ ననురాగము లేదా? ఈకాపురము సంతృప్తికరముగ లేదా?

రత్నా:—స్వామీ! ప్రమాణము చేసి చెప్పుచున్నాను నాకెంత మాత్రము నిష్టములేదు.

నార:—నీకు లెక్కలేనన్ని యాభరణములను మదీయ మంత్రమాహాత్మ్యమున నిచ్చెదను. కుచేలుని భక్తిమార్గమునుండి తొలఁగింప గలవారి నెవరినైన చూపింపఁగలవా? ఆతఁడు ఐశ్వర్యమే భక్తి కంటె వేయిమడుంగు లధికమని గ్రహించినఁ జాలును. ఆకంజాక్షుని పాదపద్మములఁ గొల్చుట మానవలయును.

రత్నా:—అందుల కొరులేల? నేనే ప్రయత్నించి చూచెదను.

నార:—నీలోపము లేకుండ ప్రయత్నింపుము. కృతకృత్యవైనను సరే. లేకున్నను సరే. ఇవిగో నీవు కోరిన యాభరణములు.

(యిచ్చును.)

రత్నా:—మహాత్మా! నమస్కారము. నిక్కువముగా నేఁడు సుదినము. నేను తప్పక నేఁడే భక్తిలోని బాధలఁ దెలిపి, యాకుచేలుని నైశ్వర్యకాముకునిఁ జేయుదును.

నార:—నీకు జయమగుగాక! నేను పోయివచ్చెదను.

(నిష్క్రమించును.)

రత్నా:—ఆభరణములపై నాకుఁ గల యాశ సంపూర్ణముగా నేఁడు తీఱినది. ఇఁక నా ప్రతాపము చూపవలయును. కుచేలుఁడు పాపము నైశ్వర్యమనిన నేమో తెలియని వాఁడగుటచే నిట్లు

భక్తితత్పరుఁడై ప్రాకులాడుచున్నాఁడు గాని యైశ్వర్యభోగాదులఁ జవిచూచి యున్నవాఁడైనచో భక్తి యను మాటయే యుండకపోవును. నాసామర్థ్యమా వామాక్షికి సైతము నింత వఱకును దెలియదు. ఇపుడు చాకచక్యముగలిగి మెలగుదును.

అనుబంధము 7

(నిష్క్రమణము.)

---

తృతీయరంగము.

---

కుచేలుని కుటీరము.

[కుచేలుఁడు పురాణము పఠించుచుండును.]

[శాస్త్రి, దీక్షితులు, సోమశర్మ, విష్ణుశర్మ కూర్చుందురు.]

కుచే:—(భాగవతము చదువుచు) మిత్రులారా! జగత్కల్యాణమూర్తి యగు నారమామనోహరునికథలఁ జదువునపుడు, వినునపుడు శరీర మానంద పులకాంకిత మగుచుండునుగదా! ఆకౌస్తుభాలంకారుని-ఆగోపికామనోనాథుని-ఆబృందావనలోలుని- ఆకంసారిని- ఆయనింద్యసుందరవదనాంబురుహుని - ఆ మహామునిసంసేవిత మృదులమనోజ్ఞ చరణుని-ఆభక్తవత్సలుని నామామృతము సుధామధురమై యలరారుగదా.

చ. మురహరుఁ డార్తరక్షకుఁడు పుణ్యనిధానుఁడు ప్రేమమూర్తి ము
ష్కరకుటిలాంతకుండు సురకైరవమిత్రుఁడు వేదవర్తియుగా
విరహులయోగులగా హృదయవీధి భజించెడి దివ్యరూపి యా
సురదమనుండు ప్రోచుత విశుద్ధనిధానముజేర్చి నిత్యముగా.

దీక్షి:—కుచేలా! ఆనందనందనుఁ డాశ్రితజనవత్సలుఁడు. ఆమహా మహానుని చరితము లోకపూజ్యము. అయ్యది నీనోట వెలువడి మఱింత పవిత్రమగుచున్నది. భక్తియుక్తుడవై యాసకలలోక వంద్యుండగు గోవిందుని పూజించు భాగ్యమునకు నోచుకొన గల్గుట నీపూర్వజన్మార్జిత పుణ్యవిశేషమే కదా.

గీ. పూర్వజన్మపుణ్యప్రపూజితుఁడవు
కనుకనే నీవు భక్తాగ్రగణ్యుఁడవయి
పతితపావను నామసంస్మరణ భాగ్య
మొందినావు కుచేల నీకోరులు సరియె?

[శంకరశాస్త్రి ప్రవేసించును.]

శంకర:—కుచేలా! కుచేలా!

కుచేల:—సోదరా! దయచేసి కూర్చుండుము. పరమపవిత్ర చరిత్రుండగు నాదేవదేవుని దివ్యగాథ నొకింతసే పాలకింపుము.

శంక:—ఆపరాత్పరుని కథలు—గాధలు నీకేగాని నాకేమియు వలదు. ముందు నాకు సమాధానము చెప్పిన పిదపఁ బురాణము పఠింపుము. మోక్షసామ్రాజ్యాధి నాథుఁడవుకన్నుమ. అద్దెనిచ్చెదవా? యింటిలోనుండి వెడలిపోయెదవా?

సోమ:—శంకరశాస్త్రి! కొంచెము మెల్లగా నడుగ గూడదా? అంత కఠినముగ అంతకర్ణకఠోరముగ నడుగవలయునా? ఒకటి రెండు దినములలోఁ దప్పక యీయగలఁడు. యిబ్బంది యెవ్వారికైన రాకమానదుగదా!

శంక:—ఇది కోరితెచ్చికొనిన యిబ్బంది. దైవికముగా సంప్రాప్తించిన కష్టదశ యగుచో నెవరైన జాలిపడవచ్చును. ఇది భక్తి యను పెనుభూతమువలన ప్రాప్తించిన దగుట నేంచుకైన కనికరించ

వలసిన యగత్యము లేదు. నాకొక్కనికేనా యీ కుచేలుఁడు బాకీయున్నది. ఊరిలోని వారందఱకుఁ తృణమో పణమో యీయవలసియే యున్నాఁడే. ఎంతకాల మూరకుందురు. శర్మా! నీవేమో పెద్దకబుర్లు చెప్పుచున్నావు. నాల్గు మాసము లూరకుందును. నీవిచ్చెదవా?

సోమ:—నేను నీవలె భాగ్యవంతుఁడ కానుగదా. ఏదో యున్న స్వల్ప ముతో నిల్లో పొట్టపోసికొనుచుఁ కృష్ణా! రామా! యనుచు కాలక్షేపము చేయుచున్నానేగాని, నీవలె భూమి, పుట్ర గలిగి వడ్డీవ్యాపారము చేయుచు, రాజానుగ్రహము సంపాదించి వర్తించుటలేదుగదా?

శంక:—అదియు దోషమేయగునా? నాపూర్వజన్మసుకృతకారణమున భాగ్యవంతుఁడనగుట, రాజానుగ్రహము సంపాదించుట, న్యాయముగ వడ్డీవ్యాపారముచేయుట గురుతరాపరాధమా. మేలు మేలు, శర్మా! నీవింత యసూయాపరుఁడవని యెఱుగను. నేనేమి యన్యాయముగ ధనార్జనమొనరించితినా? లేక నీసొమ్మేమైన నపహరించితినా? ఇంతనిష్ఠూరముగ నిందాలాపములాడి నందులకు దగిన శాస్తి చేయకపోయినచో మాఱుపేరుపెట్టుము గాని—

సోమ:—రాజుతోజెప్పి యేదో శిక్షింపజేయుదుననియా నీగర్వము. సరే అట్లేచేయుము. ఒకవేళ నీవు నా కిపుడు కించిదపకారమొన రించినను జీవితానంతరము యమధర్మరాజునొద్ద నీదుర్ణయము లకుదగిన యనుభవము నొందకపోవు. నీవుచేయుచున్నవడ్డీ వ్యాపార మెంతన్యాయానుసారముగనున్నదో నీకుఁ దెలియదా? నూటికి నెల 1 కి 1—9—0 కొంపోందువడ్డీకి బదుళ్ళిచ్చి యెం దఱి కుటుంబములు నేలమట్టముగావించినావు? ఎందఱియాస్తులు

వేలము వేయించినావు. దొంగనోట్లు సృష్టించి యెందరికొంపల గూల్చినావు? కూటసాక్ష్యములిచ్చి, యసత్యములాడి, వివాహములుచేయించెదనని, వ్యాపారములు ఫైసలుచేసెదనని, రాజు ప్రాపకముకల్గింతునని యెందఱిదగ్గఱనుండి యెంతెంతధన మన్యాయముగ గుంజినావు? నీవు ధనాశాపరుఁడవై కూఁతురును వృద్ధునకు రెండువేలరూప్యముల దీసికొని వివాహముచేయలేదా? ఇది కన్నకూతురైనను విక్రయించుకొనుటకాదా? చేతికి కడియమును చెవులకుఁ గుండనములును ధరించి పట్టుశాలువ ధరించినంత మాత్రమున బెద్దవైతివని తలఁచినావా?

సీ. ధనవాంఛ తనయుల నినపుత్రుసదనంబు
చేరువారలకిచ్చి సిగ్గులేక
విత్తకాంక్షను పరవృత్తులనెన్నక
హింసారతినిబూని యెగ్గులేక
కాంచనంబే సర్వకామితఫలదమన్
సిద్ధాంతముల హృదిఁజేర్చి యెపుడు
లోకాపవాదముల్ చీకాకునొనరింప
వెతలనొందియు నెన్నొ విత్తమున్న

గీ. మమత దౌర్జన్యముల జేసి మాన్యుడన్న
సంఘ మంగీకరించునే మూర్ఖజనులుకూడ
నిందజేయరె? యేటి కీనీతివీడు
బ్రతుకు? సన్మార్గమునగొల్వు వనజనేత్రు?

శంక:—ఓరీ పనికిరానివంద! ఇఁక నీవాచాలత్వమును గట్టిపెట్టుము. ఏమి కుచేలా! మాటాడవు? మూగవాఁడవైతివా? లేకున్న నితఁడు మనల నేమిచేయఁగలడను ధైర్యమా. మాఱుమాటాడక

వెంటనే యద్దెనిచ్చివైతువా లేక రాజుతో ఫిర్యాదుచేసి, రాజభటులచే నింటిలోనుండి యావలకు గెంటించవలయునా?

కుచే:—అయ్యా! నేనేమియు నిన్ననలేదే? నీదయయెట్లున్న నట్లు చేయుము. నాకు నాల్గుదినములు గడువిమ్ము.

(సాహుకారు కామిశెట్టి ప్రవేశించును.)

కామి:—ఏమయ్యా! కుచేలుఁడుగారు! దినవెచ్చములకై సంబారములఁ గొనిపోయి యెన్నాళ్ళయినది? ఇంతవఱకును మాకీయవలసినది యీయకపోవుటలో మీయుద్దేశమేమి? 'కోమటి'-'ఉల్లిపాయలకోమటి' అని లోకువగనున్నదా? ఏనాఁటిబాకీయయ్యా యిది? బాకీయడిగెదనని, నాదుకాణముదగ్గఱకు రాక మఱల రంగయ్య దుకాణముకడకుఁబోయి అరువు తెచ్చికొనుచున్నారా? ఆపైన సుబ్బిశెట్టి-పిదప పోలిశెట్టి ఈవిధముగా నూరినిండ బాకీలుపెంచి, అర్ధరాత్రమున నేయూరైన పాఱిపోవుదువా?

కుచే:—శెట్టీ! పరమాత్మునిసాక్షిగాఁ జెప్పుచున్నాను. నీకడసంబారములుతెచ్చిన దాదిగ మఱెక్కడకుఁబోలేదు. శ్రీకృష్ణస్వరూపులైన యతిథులను నీవిచ్చిన సంబారములతోఁ దృప్తిపఱచితిని. ఆపుణ్యము నీయదియకాదా?

కామి:—అట్లయిన సొమ్మీయనందురా? పుణ్యమెవరికి? పురుషార్థమెవరికి? మాకుఁ బుణ్యపాపములతో పనిలేదు. ఇచ్చెడి బాకీయా? ఎగఁబెట్టెడి బాకీయా? ఒక్కటేమాటచెప్పుడు. మిమ్మనవలసినదేమి? మిమ్ము విశ్వసించినందులకు మమ్ముమేమే నిందించుకొనవలయును. మీబ్రాహ్మణులను నమ్మిన మా సాహుకార్లందఱు దివాలా తీసినారు? ఏదోకొంచెము తెలివి గలవాఁడనగుట సాధ్యమైనంతవఱకు జాగ్రతగనే యున్నాను

గాని, మీవంటివారు వచ్చినపుడు పప్పులో నడుగువేయు చుందును.

శాస్త్రి:—చూచితివా శర్మా! నేనొక్కఁడనే యనుకొన్నావు. శెట్టి యొకఁడు. కుచేలుని మూలమున మనబ్రాహ్మణజాతి పరువునకే భంగమువచ్చినది.

కుచే:—శెట్టీ! నాలుగు దినములు తాళుము. ఆనందనందనుని యను గ్రహమున నీబాకీ తీర్చివేయుదును.

శామి:—నందనందనుఁ డెవరయ్యా! అతఁ డెవరైన మనయూరికిఁ గ్రొత్తగా వచ్చిన వర్తకుఁడా?

శంకర:—కాదుగాఁదు. శ్రీకృష్ణభగవానుఁడు. అతఁడే నాయుద్దియు, నీ బాకీయుఁ గూడ నిచ్చును. సందియములేదు. శిసత్తైనమాట.

(తెఱలో భజగోవిందం! భజగోవిందం)

శామి:—అదిగో యెవరో బైరాగి. భజగోవిందమట. ఆభజగోవిందము నకుఁ గూడ మన కుచేలుఁ డేమైన బాకీయున్నాఁడా?

నార:—(ప్రవేశించి) ఓహో! సభికులు చాలమంది కూర్చుండి యున్నారే.

కుచే:—(లేచి సాష్టాంగ దండప్రణామ మొనరించి) త్రిలోకవంద్యుఁడ వగు నో నారదమునీంద్రా! నీదర్శనముచే నాపాతకములన్నియు దొలఁగెను. ఈకృష్ణాజినముపై నాసీనుఁడవుకమ్ము.

శామి:—స్వాములవారూ! మనదేయూరు.

నార:—ఓయీ! నాదేయూరని చెప్పుదును. నే నెల్లలోకములకుఁ బోవుచుందును.

గీ. అరయఁ బదునాల్గు లోకమ్ములందు నేదియు
స్థిరనివాసముగా నివసింపఁబోను
లోకసంచారి నందురు ప్రాకటముగ
శెట్టీ! తెలియుము నాచిత్ర చేష్టలెల్ల.

కుచే:—ఓయీ కామిశెట్టీ! ఆయన లోకవంద్యుండగు నారదమునీంద్రుడు. ఆయన ముక్కోపి. కోపించెనా శపించును. నేను చెప్పినట్లు, నాల్గుదినములు గడచిన పిదప రమ్ము.

కామి:—నాల్గుదినములు కాదు. ఒక్కదినమైన నాగుటకు వీలులేదు. నాబాకీ యిచ్చెదరా లేదా?

శంక:—అదీ వరస. నాయద్దె నిచ్చెదవా లేదా?

కుచే:—అయ్యలారా! ఎవరికిని యీయక నేనెక్కడికి పోవుదును? ఆజగదారాధ్యుని కృపయున్నచోఁ దప్పక యన్ననాఁటి కీయఁ గలను.

శంక—ఆజగదారాధ్యుఁడు నీకేదో యిచ్చుననుట కల్ల. ఆతఁ డొకవేళ యిచ్చిన దేమైన యున్నచో నది రాఁబోవు జన్మమందేగాని, యీజన్మమున నట్టి సౌభాగ్యమేదియు నుండదని ముమ్మాటికిని నొక్కి వక్కాణింతును. నాల్గుదినములలో నెవరిత్తురు. నీకు యిప్పటికే యెన్నో ఋణములున్నవి. క్రొత్తగా మరెచ్చటను నప్పు పుట్టదు. చెప్పినది నమ్మునట్లుండవలదా? ఆలోకకల్యాణ మూర్తి, నీ శ్రీకృష్ణభగవానుఁ డిచ్చునని, నాల్గురోజులలో కాదు నాల్గుమాసములలో యిచ్చునని, నీవు మ్రొక్కిన యీనారద మునీంద్రునిచేఁ జెప్పింపుము, మేము వెడలిపోయెదము.

నార:—కుచేలుఁ డధర్ముఁడు వర్తకాఁడా. తప్పక మీధనము నిచ్చి వేయఁగలడు. నేనాతనికి ధర్మోపదేశ మొనరింతును.

# ద్వితీయాంకము.

[మాధవుఁడు, రంగఁడు, కృష్ణుఁడు ప్రవేశింతురు.]

మాధ:—జనకా! ఆకఁటిబాధకుఁ దాళజాలకున్నాను.

రంగఁడు:—అయ్యో! నాన్నా! నిన్నరాత్రికూడ నేనేమియుఁ దిననైతిని. గంజియంతయు కృష్ణుఁడే త్రాగివైచినాడు.

[శర్మ, శాస్త్రి, శెట్టి, దీక్షితులు నిష్క్రమింతురు.]

కుచే:—ప్రభూ! శ్రీకృష్ణపరమాత్మా! నీదాసుఁడనగు నన్నిట్లు గాసిలఁ జేయనగునా? తండ్రీ! నేను నీకుఁ గావలసినవాఁడను కానా? నీయాశ్రితుడనుగానా? నానాయనలారా! ఊరకుండుడు. వనికేగి యిపుడే నీవారధాన్య మేఱుకొని వచ్చెదను. సంయమీంద్రా!

ఉ. కాననసీమలందుఁ జని, కల్గిన ధాన్యమునేరి చేర్చుచుం
మానివరేణ్య సేవలకు మామకజన్మ తరింప గొల్చెదం
బూనక యాగ్రహంబు తమ పూతపదంబుల మాగృహంబులం
బూనిక పావనంబొనరఁ బూనుఁడు నిల్పి దయార్ద్రచిత్తులై.

నాయందు దయయుంచి, నాయాతిథ్యము స్వీకరించి, నన్ను ధన్యునిఁ జేయుము.

నార:—(స్వగతము) ఆహా! కుచేలుని భక్తి యెంత దృఢమైనది. సంపూర్ణముగా పరిణతినందిన యీమహాభక్తుని యీమాధవుఁ డేల పరీక్షించుచున్నాఁడోగదా! (యోచించి) అవును. మహాభక్తియుక్తుఁడయ్యును, నేకాగ్రచిత్తుఁడయ్యును, నిరత హరిచరణారవింద ధ్యానాసక్తుఁడయ్యును, సంసార వ్యామోహమింకను విడజాలక, నాతనయులని, నాసతియని ప్రాకులాడుచున్నాఁడు. (ప్రకాశముగా) ఓయీ! కుచేల! నాపలుకొక్కటి వినుము. ఏల నీవిట్లు దుస్సహదారిద్ర్యానల తప్తుఁడవై దుఃఖ

పిల్లదవు? శంకరశాస్త్రి చెప్పినట్లు రాజానుగ్రహము బడసి, ధనార్జన మొనరింపరాదా. సతీసుతులతో సుఖముగా జీవించుట కంటె నీకుఁ గావలసిదేమి? మనశ్శాంతి లేనిదే భక్తిమాత్ర మెట్లలవడును? చూచుచున్నాఁడవుగదా? నీతనయులెట్లు తిండి లేక మలమలమాడిపోవుచున్నారో. వారి వదనము లెట్లు చెన్ను దొఱంగియున్నవో చూడుము. ఆహా! నాచిత్తము నిక్కముగా వ్యస్తమైపోయినది. కుచేలా! ఏమందువు?

సీ. బ్రహ్మచర్యముఁ బూని వైదికవాఙ్మయ
 పఠనంబుగావించి ప్రజ్ఞఁబొంది
వర వర్ణనీయ నుద్వాహంబు దాఁగొని
 సంతానముం బొంది, సలిపి దాన
ధర్మాది కర్మలు ధనము చేకూర్చియు
 నిఖిలార్థ సుఖములు నెమ్మిఁబొంది
భోగభాగ్యములెల్ల పొంది సంతోషించి
 వార్థక్యమున్ననుల్ వాడకాయ
గీ. మఖిలలోక సంరక్షకు నబ్జనాథు
సకల సంసార సాగర నౌకయగుట
గొలిచి పరమభక్తిని యెట్లో కొంతకాల
ముండ, నాపైని శాంతితో ముక్తి దొరకు.

కుచే:—నారదమునీంద్రా! సమస్తము తెలిసియుండియు శ్రీహరి చరణ ధ్యానతత్పరుఁడనై యుండిన నాకు వైముఖ్యము బోధింప వచ్చునా? శ్రీకాంతుని యనంతకోటి లీలావిశేషంబుల నీ వెఱుంగవా? త్రికాలములయందును, నాయఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుని పవిత్రనామసంస్మరణమే చేయు మహర్షిచంద్రుఁడవు

నాకట్లు భోధసేయుట పాడియగునా? నాకాపరాత్పరుఁడే ధనము. ఆతఁడే నానిధి. ఆకరుణాసింధువే నాయుద్యోగము. ఆపరమ పురుషుని నామామృతము తనివితీఱఁ గ్రోలుటయే నావృత్తి; నాధర్మము; నావిధి. ఆయానందమనోజ్ఞమూర్తి వదనాంబురుహ సందర్శనమే నాయాశయము. నాకుఁ దిండిలేక పోయిననుసరే. నాసతీసుతులు తుదకు దారిద్ర్యాధిదేవతకు బలియై మృత్యు దేవతయొడిలో నిద్రించినను సరియే. శంకరశాస్త్రి నాకు యావజ్జీవ కారాగారవాసము ప్రాప్తింపఁజేసినను సరే. ఆరమాకాంతుని చరణసేవ మానను. మానను. మానను.

గీ. నిఖిల లోకాధినాధుఁడై నెగడునట్టి
హరిని స్మరియింప మాన నెక్కారణాననైన
కడకు గారాగృహమ్మున కష్టపడిన
మరణమే మాకు నెప్పుడు శరణమైన.

నార:—(స్వగతము) ఆహా! కుచేలునిభక్తి నిరుపమానము. ఈతఁడు నిక్కముగా భక్తాగ్రగణ్యుఁడు. పాపము శ్రీకృష్ణుని కృపాపాంగ వీక్షణము లితనిపైఁ బ్రసరించుట కింకెంత కాలము పట్టునో గదా! (ప్రకాశముగా) కుచేలా! నీవారధాన్యమునకై పోయిరమ్ము. నేనుకూడ మఱల వచ్చెదను.

(నిష్క్రమించును.)



ఓం

అవిఘ్నమస్తు.

శ్రీరామాయనమః

# భక్తకుచేల నాటకము.

## తృతీయాంకము.

ప్రథమరంగము.

[అరణ్యమున కుచేలుఁడు ప్రవేశించును.]

అనుబంధము 8.

కుచే:—ఆహా! హృదయమును దారిద్ర్యసంజనితమైన యారాట మెంతయు కలఁచివైచినది. ఆమనోవ్యథయంతయు ప్రశాంతమైన యీకాననమును జేరినంతనే యంతరించినది. మునిజనవాసయోగ్యమై, నిస్తబ్ధాధిదేవత మూర్తీభవించియున్న యీకాంతారసీమ నాచిత్తమున కమితమైన శాంతి చేకూర్చినది. నిర్జనమైనయిట్టి విపినమున హాయిగఁ దప మొనరించుకొనకుండ పరమాత్ముఁడు నన్ను సంసారమనుసాగరమునఁ గూలద్రోసిచనెఁగదా! నీవారధాన్య మీప్రాంతమున విశేషముగ దొరకునని యాశించి తిని గాని నాయాస యడియాసయైనది. మూషికములు గింజల

ఏఱుకొని తినఁగా మిగిలిన పొల్లుధాన్యమే యిచట కన నయ్యెడిని. అక్కటా! పూర్వజన్మమున నెంతటి మహాపాతకము సల్పితినో, యీజన్మమున సకుటుంబముగఁ దిండికై చెప్పరాని యిడుములఁ గుడుచుచుంటిని గదా! నాపసికూన లొక్కపూటయైన, జననమొందినదాదిగ, గడుపునిండ భుజించి యెఱుఁగరు గదా! నాసతి యుపవాస కృశీభూతయై యున్నది. ఆహా! దారిద్ర్యమా! నీమాహాత్మ్యము వర్ణనాతీతము. ఏనుగులఁ బీనుగులఁ జేసి వైతువు. క్షణములో నానందమును దుఃఖముగా మార్చి, కన్నీటికాలువల, బ్రవహింపఁజేయఁగలవు. సద్భావముల దుర్భావములుగ మార్చగలవు. ధర్మమార్గానుసారులై మెలఁగువారి నధర్మప్రవర్తకులుగఁ జేయుదువు.

ఉ. వారధి నీకటాక్షమున పంకజశోభిత నీర ధామమౌ
నీరధివహ్నితుల్యమయి నృత్యముసేయును నీవెకోరుచో
భూరిప్రచండ వాయువులు మోదము గూర్చెడి పిల్లవాయువుల్
గారహిమించు నీదయను కైరవనేత్ర కృపాపయోదధీ.

ఏమి నావెఱ్ఱి? కాలాతిక్రమణమగుచున్న విషయము గమనించనైతిని. ఇచ్చట కొంచెము కొంచెముగా నున్న నీవారధాన్యము నేఱెద గాక. (ఏఱుచు) అయ్యో! అయ్యో! చచ్చితిని. పాదములోఁ బెద్ద కంటకము గ్రుచ్చుకొనినది. రక్తము స్రవించుచున్నది. అక్కటా! ఈప్రదేశమంతయు కంటక భూయిష్ఠమని ముందే యేల గమనించనైతిని? దురద్రుష్టమనిన నింకేద్ది? ఈనిర్జనారణ్యమున నాకు దిక్కేది? ఎచ్చటినుండి నీవారధాన్యమునకై యింతదూరము వచ్చితిని? ఇంటికడ నాసతీసుతు లెంతగా కుందుచుందురో కదా!

ఆఁకటిబాధకుఁ దాళజాలక నాతనయు లెంతగా వదరుచుండు రోగదా! ఏమి చేయుటకును దోఁపకున్నది.

గీ. ఇంతతడవయ్యె ననుచు నేనెందుపోయి
యుందునోయని కుందుచు నుండు సతియు
కంటకము బాధ యెంతయు గాటమయ్యె
నెట్టు నిలుజేరువాడ నింకేమిసేతు?

[తెరలో నిత్యానందా! ఇటు. ఇటు.]

కుచే:—ఎవరో తాపసోత్తము లీమార్గమున వచ్చుచున్నట్లున్నది.

[నిత్యానందుఁడు, జ్ఞానానందుఁడు నను మునులు ప్రవేశింతురు.]

నిత్యా:—ఓయీ! నీవెవరవు? ఎందుండి యిచ్చటికి వచ్చినావు?

జ్ఞానా:—అట్లు దీనాననుఁడవై యుండుటకు గతంబెద్దియో తెలుపఁ దగినదైనచోఁ దెలియఁజేయుము.

కుచే:—తాపసోత్తములారా! ముందుగా నానమస్కారము గైకొనుడు. నేను రత్నపురి నివాసుఁడ. వేదపాఠుఁడను. నీవారధాన్య మేఱు కొనుటకై కాననమునకు వచ్చి, కంటకము పాదమున గ్రుచ్చు కొనగా, నడువలేక బాధపడుచున్నాను.

నిత్యా:—(తనలో) పాపము చినిగిన వసనముల ధరించిన యీబ్రాహ్మణుఁడు మిక్కిలి పేదవాఁడని తోఁచుచున్నది. (ప్రకాశముగా) ఓయీ! ద్విజోత్తమ! దానికై యంతగా విచారింపనేల? ఏదీ నీపాదము నిటు తెమ్ము. కంటకము నూడ బెఱుకుటకుఁ దగిన సాధనము మాకడ నున్నది. జ్ఞానానందా! నీదగ్గఱ నున్నపట్టు కారు నిటు తెమ్ము.

కుచే:—మునికులతిలకులార! తపోధనులగు మీచేఁ బాదము పట్టించు కొనుట మహాదోషము. గతజన్మమున నిష్కృతిలేని మహాఘ

నొనరించి యుండుటచేతనే, యీజన్మమున నిట్టి కట్టిడుమల గుడువవలసి వచ్చినది. వలదు. ఎట్లో బాధపడుచు నింటికిఁ బోయెదను.

జ్ఞానా:—ఓయీ! బాధపడుచుండగాఁ గాలు చేతికిఁ దాకకుండ నెట్లు కంటకముఁ దీయఁగలము? నీవు దురుద్దేశపూర్వకముగ మముఁ బోటులఁ దన్నినచోఁ బాతక మొదవుఁగాని, యిప్పట్టున నాదోషము సంక్రమింపనేరదు. (ముల్లుతీసి, యేదో ఆకు నలిపి, యీరసముఁబూయును.)

కుచే:—మీకుఁ గృతజ్ఞుఁడను. నాబాధ మటుమాయమై పోయినది. నాకు సెలవిండు.

నిత్యా:—మఱి నీవారధాన్యము నేఱుకొనుటకు వచ్చితినని చెప్పినావే, ధాన్యము నేఱుకొంటివా?

కుచే:—అదియు నాదురదృష్టమే. ధాన్యము లభించలేదు. ఏవో కొలదిగ లభించినవి. వానినే కొనిపోవుదును.

జ్ఞానా:—ఓబీదబ్రహ్మణుఁడా! నీరూపురేఖావిలాసాదులు, నీభాషణములు మాహృదయముల దయార్ద్రములుగఁ జేసినవి. మేము మఱల నేఱుకొందుము. మేము సేకరించియున్న యీధాన్యమును గొనిపొమ్ము.

నిత్యా:—సందేహింపకుము. నీవువచ్చి చాలసేపై యుండును. నీకొఱకు నీభార్యాపుత్రులాత్రముతో నెదురు చూచుచుందురేమో.

కుచే:—(స్వీకరించి) మహాత్ములార! కృతజ్ఞుఁడను. మీకనేక వందనములు. (ముందునకుఁ బరిక్రమించి) ఇచ్చోట ధాన్యమపారముగ నున్నవి. మఱికొంచెముగ నేఱుకొందునుగాక.

(ఏఱుచు నిష్క్రమించును.)

## ద్వితీయరంగము.

---

[కుచేలుఁడు గృహమున]

కుచే:—సతీమణీ! సకలలోకాధినాథుఁడగు నా శ్రీకాంతుని కరుణా కటాక్షవీక్షణము మనపైఁ బ్రసరించుటచేతనే నిన్నటిదినమున జాలధాన్యము లభించినవి. నిక్కువముగా నిది యాదేవదేవుని కృపావిశేషముగాకున్న మఱేది? ఎన్నోదినములనుండి కడుపు నిండుగ భుజించి యెఱుఁగవు. నేఁడైన నీవును, బిల్లలును కడు పార భుజింపుడు.

చ. కడు నిరుపేద శ్రీధవుని కైరవపాదరజంబు సోకినన్
కడు ధనవంతుఁడై సుఖముగాంచు శచీధవు స్వర్గధామమున్
కడుసులభంబుగాగను కల్గినతద్దరి క్రోధవేశమున్
కదలినిబోలు సంపదలు కాంచనగర్భుడు బ్రోవవచ్చినన్.

వామా:—నాథా! ధాన్యము నారబోసియుంటిని. ఇపుడే నానిని దంచి వంటచేయుదును. రంగనికి రాత్రినుండి జ్వరముగనున్నది. చాల తీవ్రముగనుండుటచేగాఁబోలు మూసినకన్ను తెఱువకున్నాడు. నాకేమియుఁదోఁచుటలేదు.

కుచే:—అయ్యో! ఆదయామయుఁడగు శ్రీకృష్ణునిపైన భారమిడి యూరకుండుటకంటె మనమేమి చేయగలము.

[మాధవుడు ప్రవేశించును.]

మాధ:—జనకా! ఎవరో యోగులు వచ్చుచున్నారు.

కుచే:—(లేచి ముందుగాఁబోయి నమస్కరించి) ఓ దైవస్వరూపులారా! మీకిదే సాష్టాంగదండప్రణామ మాచరించుచున్నాడ.

[యోగులు పాడుచు ప్రవేశింతురు.]

అ ను బం ధ ము.

యోగులు:—సకలాభీష్ట సిద్ధిరస్తు.

కుచే:—మహాత్ములారా! ఈయాసనముపై నుపవిష్టులు కండు. మీసం దర్శనముచే నేను తరించితిని. నేఁడు సుదినము. పరమాత్ముని దర్శించినచో నెంతపున్నము కలుగునో, మిమ్ము చూచుటవలన గూడ నాచిత్త మట్టి యనిర్వాచ్యానంద మొందినది. నేఁడు నాయాతిధ్యము స్వీకరించి, నన్ను ధన్యునిఁ గావింపఁ గోరె దను.

గీ. మీందు పదధూళిసోకుట మేను ధన్య
మయ్యె; నాదుకోరిక మీార లరయవలయు
భక్తి నే నిదువిందును బరమహర్ష
మతిని గొన వేడువాఁడనో మాన్యులార!

[తెరలో భజగోవిందం భజగోవిందం]

కుచే:—ఓహో! నాజన్మ నేఁడు నిశ్చయముగా సఫలతఁ గాంచినది. నారదమునీంద్రునకుఁ గూడ విందొనరించి, తరింతును గాక.

నార:—(ప్రవేశించును.)

కుచే:—హేనారదసంయమీంద్ర! నానమస్కారము గైకొనుఁడు.

నార:—అభీష్టసిద్ధిరస్తు. (కూర్చుండును.)

కుచే:—అతిధులార! నదికిబోయి, మీారుస్నానాద్యనుష్ఠానముల నిర్వ ర్తించికొని రండు.

(యోగులు నిష్క్రమింతురు.)

కుచే:—నారదమునీంద్ర! అతిధులు దైవస్వరూపులని విజ్ఞులు పలుకు చుందురు. సత్యమే యగునా?

నార:—నిజమేగాని కుచేలా! నీకేమైన మతిచలించినదా? ఇంటిలోఁ తినుటకేమియు లేక, నీభార్యాపుత్రు లాకటి బాధచేఁ గుందు చుండ నీయతిధులేమి? అభ్యాగతులేమి?

గీ. నీదుభార్యయు, బుత్రులు నిన్నమొన్న
నుండి యాకటి బాధచే డెందమందు
కుందుచుండిన యియ్యెడ మందబుద్ధి
వగుచు నతిథులఁ బిలువంగ నగునె సఖుఁడ.

కుచే:—మహాత్మా! నిన్న కాననమునకుఁ బోయి నీవారధాన్యము నేఱుకొనివచ్చితిని. అవి అతిథులకు, పిల్లలకుఁగూడ సరిపోవును. నాయాతిథ్యము స్వీకరించి నన్ననుగ్రహింపుము.

నార:—ఆయతిథులు నీదారిద్ర్యమునుగూర్చి యెఱుఁగని వారగుటచే నంగీకరించిరి కాని, యన్నియుఁ దెలిసినవాఁడనై యెట్లు నీ యాతిథ్యము స్వీకరించుటకు సంసిద్ధుఁడనగుదును?

మాధ:—జనకా! తమ్ముఁడు తీవ్రజ్వరముచే బాధపడి మూల్గుచున్నాఁడు. చాల ఆకలిగనున్నదని యేడ్చుచున్నాఁడు.

వామా:—తనయుఁడు మీకొఱకుఁ బలవించుచున్నాఁడు. ఒకసారి రండు.

కుచే:—సంయమీంద్రా! ఇవుడే వచ్చెదను.

(లోనికేగి, కుమారుని చూచును.)

కుచే:—నాయనా! రంగా! జ్వరముగా నున్నదా తండ్రీ!

రంగ:—తండ్రీ! నాకు మిక్కుటముగ నాకలివేయుచున్నది. అన్నముఁ బెట్టుమని యమ్మతోఁజెప్పుము.

కుచే:—నాచిన్నితండ్రీ! జ్వరముగనున్నప్పుడు యెవ్వరైన భోజనము చేయుదురా? అదిగాక మనయింటికి నేఁడు ముగ్గురు తపోధనులైన మును లతిథులుగా వచ్చియున్నారుకదా! వారు భుజించకుండ మనము తినవచ్చునా? జ్వర ముపశమింపనిమ్ము.

రంగ:—నాకాకలిమూలముననే నీరస మధికమై జ్వరమువచ్చినది. అన్నము బెట్టించుము.

కుచే:—నాకన్నతండ్రీ! అతిథులకుఁ గోపము రాదా? ఒక్క క్షణమాగుము. అతిథు లారగించిన మరుక్షణముననే నీకు బువ్వపెట్టెంతు నోయి.

వామా:—పోనిందు చల్దియన్నము కొంచెము పెట్టుదునా?

కుచే:—ఆకలిబాధ సహింపజాలకున్నాఁడు కాఁబోలు. ప్రాణేశ్వరీ! అట్లయిన జల్దియన్నము కొంచెము పెట్టుము. జ్వరములేదు. నీరసమే.

వామా:—నాచిట్టితండ్రీ! అట్లయిన రమ్ము.

నార:—కుచేలా! కుచేలా! నీవారధాన్యమును ధేనువు తిని పరుగెత్తుకొనిపోవుచున్నది. అయ్యో! అతిథులకెట్లు భోజనమిడెదవు?

కుచే:—(చూచి) నాకేమియు విచారములేదు. పరమాత్ముఁడే ధేనురూపమున నరుదెంచి యానీవారధాన్యము భుజించెను. ఆహా! ఏమి నా భాగ్యము!

గీ. పరమపావనుఁడైన నాప్రభువునేఁడు
ధాన్యము భుజించి కరుణవదాన్యుఁడయ్యె
నాదుపుణ్యంబు వచియింప నలువకైన
తరమొ? నారాయణుండె నాకరయదిక్కు.

నార:—ఓయివెఱ్ఱివాఁడా! ఒకవంక భార్యాపుత్రులు మలమలమాడుచుండ మఱొకవంక నతిథులు స్నానార్థమై నదికిఁబోయియుండ ధేనువువచ్చి నీవారధాన్యము భుజించిపోవ 'ఏమినాభాగ్య'మని పలుకుటకు నీమనస్సెట్లొప్పినది?

మాధ:—జనకా! చల్దియన్నమును శునకము తాకినది. తమ్ముఁ డేడ్చుచున్నాఁడు.

వామా:—నాథా! నీవారధాన్యమును గోవుభుజించినదా?

కుచే:—అవును.

వామా:—అట్లయిన నతిథుల నెట్లు సంతృప్తులఁ జేయనగును?

నార:—కుచేలా! ఏల యీరీతి దైన్యావస్థనుఁగోరి యనుభవింతువు? అతిథులకెట్లన్నమిడుదువు? నీయవస్థ చూచుచున్నకొలఁది నా హృదయము వ్యథితమగుచున్నది. ఎందులకీదారిద్ర్యము ననుభవింతువు? నీ కష్టములు చూచువారి హృదయములు దుఃఖవారాశి నిమగ్నములగును.

కుచే:—పరాత్పరా! ఇదంతయు నీలీలావిశేషముగాక యన్యముకాదు. నన్నిట్లు విషమపరీక్షఁ జేయుట పాడిగాదు. నేను నీకన్యుఁడనా? ఓదయాస్వరూపా! నీదాసుఁడను. నీకేల దయరాదు. నీమధుర మంజుల వినీలమోహన స్వరూపముతో నాకు సాక్షాత్కార మొసగి యేలరక్షింపవు? సవతితల్లిచే దిరస్కృతుఁడైన బాలభక్తుఁడగు ధ్రువునకు శాశ్వతస్థానమొసఁగి బ్రోచినది నీవుకాదా? ఖల మతియైన దుశ్శాసనుఁడు నిండుకొలువున ద్రౌపదికి మానభంగ మొనరింపఁబోవ వలువలక్షయముగ నొసఁగి రక్షించినది నీవు కాదా? మకరిచేఁజిక్కిన కరిరాజు నెవరుకాచిరి? 'పతిశాపవశమున గతిలేకపడియున్న' శిల నహల్యగామార్చి శాపవిమోచనము గలిగించిన దయాశాలివి నీవుకాదె? హేత్రిలోకాధినాథ! హే నారదతుంబురాది మహాభక్తజనసంసేవితచరణ! హేనిఖిలపాప విదూరా!

సీ. అలనాఁడు ద్రౌపది హా కృష్ణయని వేడ
మానరక్షణఁజేయ మఱచినావె
మకరి చేతికిఁ జిక్కి మనుపగా వేడిన
కరిరాజుఁబ్రోచుట మఱచినావె
భక్తాగ్రగణ్యుఁడౌ బాలుఁడు ధ్రువుడేడ్వ
కనికరమ్మున నీవు కావలేదె

పతిశాపవశమున గతిలేక శిలమైన
శిలను నాతిగ నీవు చేయలేదె
గీ. నీవె గతియని నమ్మితి నీరజాక్ష
భక్తిచేతనె నాకీవు ముక్తినిత్తు
వనుచు నమ్మితి నన్నింక నరయవేమి
జాలమొనరింపవలదోయి తాళలేను.

రక్షింపుము. నీవు రక్షింపకున్న నాకిఁక గత్యంతరమేలేదు. నాపాపముల కిఁక నిష్కృతిలేదా? ప్రభూ! ప్రభూ! నామొరాలకింపుము. నన్ను రక్షింపుము. కృష్ణా! కృష్ణా! కృష్ణా! (పడిపోవును.)

నార:—అతులితభక్తిసంపన్నుఁడైన యీకుచేలునియెడ నాశ్రీకాంతుఁ డింకను నలుకవహింపనేల? అమ్మా! వామాక్షీ! కొంచెము జల మిటుగొనివచ్చి నీనాధునకు శైత్యోపచారముల జేయుమమ్మా!

(వామాక్షి శీతలోపచారముల జేయును.)

రంగ:—అమ్మా! ఆకలి. అమ్మా! ఆకలి. అయ్యో! దుర్భరము. నే నిఁకబ్రతుకజాలను. నేనుచనిపోవుదును. అమ్మా! ఒక్కసారిరమ్ము. నాప్రాణములు పోవుచున్నవి.

వామా:—నాతండ్రీ! వచ్చుచున్నాను. హాదైవమా! ఈకష్టములకిక యంతమేలేదా? పరమాత్మా! నానుదుట దుఃఖమునే యనుభ వించునట్లు లిఖించితివా? ఈసంతాపమున కంతములేదా? ఈ బాధలు తొలగునట్టి యదను లభింపనే లభింపదా? భర్తవిచా రాతిశయమున డోలాందోళితచిత్తుఁడై చైతన్యముగోల్పోయి నందులకే కుందుదునా? కన్నకుమారుఁడు మరణాపన్నుడై 'అమ్మా! అమ్మా!'యని యెలుఁగెత్తి విలపించుచున్నందుల కేడ్తునా? రానున్నఅతిధులకు భోజనము సమకూర్చుట కింట

నన్ను నీవారధాన్యముకూడ గోవుపాలయ్యె నేయని విచారింతునా? ఇంతకాఠిన్యమేల? ప్రభూ! శ్రీకృష్ణపరమాత్మా! నిన్నుదూషించుచున్న నామందమతి నే మందలించుకొనవలయును. ఇప్పట్టున భవదీయస్వరూపులగు నీయతిథుల సత్కరించుటయే నాకు గర్తవ్యము. రత్నావళియింటికేగి యామె కూడిగ మొనరించియైన ధాన్యమును దేవలయును. నారదమునీంద్రా! సకలదిక్పాలకులారా! దేవాదిదేవా! నానాథునిచింత దొలగింపుడు. నాతనూభవుని రక్షింపుడు. రమారమణా!

చ. అనయము నీపదాంబుజము లర్చనసేయుచునుండునట్టి మా
కనఘ యొసంగవేల నిల నవ్యయమౌ ఘనభోగభాగ్యముల్
వనరుహనేత్ర కష్టతతిబాపుము నాదగు పుత్రునార్తి నో
జనసుత బాపువాడవని చాలగనమ్మిన దాననేగదా!
శ్రీకాంతా! నీదేభారము.

(నిష్క్రమింపును.)

[తెరపడును.]

---

## తృతీయరంగము.

---

[రత్నావళి-భర్త శంకరశాస్త్రి ప్రవేశము.]

రత్నా:—ఏమండీ! కాసులపేరు చేయించెదనని నాల్గునెలలనుండి ఆశపెట్టుటయేగాని నిజముచెప్పవు; చేయించదలచుకొనలేదా? లేదా, చేయించలేనని చెప్పుడు; మఱెన్నడు నడుగను.

శంక:—బాగుగా జెప్పినావు. నేనుచేయించలేనే. నన్నువదలిపెట్టుము. అట్టే బాధించవలదు.

రత్నా:—ఈయేడుపు ముందేమైనది? మొదట నే నడిగినపుడే యీ రీతిగా నఘోరించియున్నచో నడుగక యూరకుందునుగదా! చాలాగొప్పమాటే.

శంక:—ఏమే. మాటలుముదురుచున్న వే. అఘోరింపని ప్రేలుచున్నావు? జాగ్రత.

రత్నా:—నగలు చేయించమని యడుగుట తప్పా? నేననని దే, అఘో రింపని యన్నానని, నిష్ఠురాలాపము లాడుచున్నారు. పెండ్లి యెందులకుఁ జేసికొన్నారు? నాతల్లి చనిపోయినది గదా. తండ్రి బాల్యముననే గతించినాఁడు గదా! ఎవరు లేరని మీరు లోకువ చేసి తిట్టుచున్నారు. చనిపోవుచు, చనిపోవుచు, నా కీరెండవ పెండ్లి మగని నెత్తిపై గట్టి పోయినది. వివాహమైన దాదిగ అంపవుకోతయేగాని, యొక్కనాఁడైన సుఖించలేదు గదా! ఎందుల కీపనికిమాలిన బ్రదుకు? (ఏడ్చును.)

శంక:—అయ్యో! నవ్వుచు నవ్వుచు యింతలోనే తటాలున రంగము దుఃఖమయముగ మార్చివేసినావేమే? అయ్యో కర్మమా? కొంచెము గట్టిగా మాట్లాడిన నేడుపు. ఆఁ యనిన నేడుపు. ఊఁ యనిన నేడుపు. రత్నా! నీవు కాదు. నేనేడ్చుచున్నాను. భార్యపోయినపుడు భర్తపునర్వివాహము చేసికొనరాదని శాస్త్రములు ఘోషించుచున్నవి. అయినను నేదో యింత కాచిపోసెదవని, సుఖపెట్టెదవని, అందమైన పిల్లనని, హాయిగా పాడెదవని, నీతల్లి చేతిలో వేయిరూపాయలుపెట్టి పెండ్లిచేసికొన్నాను గాని ఊరికే నీతల్లి నిన్ను నానెత్తిపైఁ బెట్టలేదు. నిన్ను వివాహమాడి నేనెంత యేడ్చుచున్నానో ఆపరమాత్మునకుఁ దెలియును. మూడేండ్లయినదిగదా నీవు కాపురమునకు వచ్చి

ఒక్కసారియైన నవ్వుచు మాట్లాడినావా? ఒక్కనాఁడైన తాంబూలమిదిగో అని యిచ్చినావా? ఏదో తిరిగి తిరిగి యిల్లు చేరుకున్నాఁడని జాలిచెందియైన పాదములొత్తినావా? ఎంతసేపు మగఁడావల కెప్పుడు బోవునా, ఎప్పుడు వీధిగుమ్మములో నిలిచి దారిపోవు యువకులవంకచూచి నవ్వుదునాయని నీయుద్దేశము. నీవు వచ్చిన దాదిగ నాచిత్తమున నించుకైన శాంతి లేదు గదా! కోరి వేడి చేసికొన్న పెండ్లిం డ్లిట్లే యుండును.

రత్నా:—మిమ్ముల ననవలసిన యవసరమేమున్నది. నాకర్మమును నేనే నిందించుకొందును. ఎంతభాగ్యమున్న నేమి? సంసారసౌఖ్యము శూన్యమైనపిదప నాకు యించుకైన స్వేచ్ఛలేదుగదా! ఎవ్వరి తోను మాటాడగూడదట. వంటలక్కదగ్గఱ కూర్చుండరాదట. ఏమియుఁ గొనరాదట. ఒక్కయుపన్యాసమైన వినరాదట. ఏమి యీనిర్బంధము? ఎందులకువచ్చిన పనికిమాలిన కాపురమిది? ఛీ! ఇట్టి హైన్యపుబ్రతుకు బ్రతుకుటకంటె మృతినొందుట మేలు. (బిగ్గరగా ఏడ్చును.)

శంక:—అయ్యో! ఎందులకీఏడుపు? అస్తమానమూ ఏడుపేనా? రత్నా! నామాట వినవా? నీయుద్దేశమేమి? వంట నేను చేయవలయునా? సరే అట్లేచేయుదును; నీవు రాజాస్థానమునకుఁ బోయి నేఁ జేయు నదంతయుఁ జేసిరమ్ము. నగలు నగలోయందువు. కుచేలుఁడు నాలుగుమాసముల నుండి అద్దె నిచ్చుటలేదు; అది వసూలు చేయనిమ్ము. నీకు మంచి చీరలు కొనితెచ్చెదను.

రత్నా:—ఎప్పుడో యెందులకు? కుచేలుఁ డేమియు లేనివాఁడుగదా! వానినిఁబట్టి పీడించుట యెందులకు? అతఁడు నేను జీవించి యుండగా మీకు సొమ్మీయఁజాలఁడు. నాకిపుడు చీరలు కొనితెండు.

శంక:—సరే. బజారునకుఁ బోయి చీరలఁ దెచ్చి యిచ్చెదను. కుచేలుని కడనుండి సొమ్ము నెల్లిన గుంజితీరవలయును. అతఁ డీయనిచో రాజుతోఁ బిర్యాదుచేసి, యింటిలోనుండి యావల కీడ్పించ వలయును.

[వామాక్షి ప్రవేశించును.]

వామా:—అమ్మా! రత్నావళీ! రత్నావళీ!

రత్నా:—ఎవరు? వామాక్షీ! ఏమిా? ఎందులకువచ్చినావు?

వామా:—నేఁడు మాయింటికి ముప్వురుయోగులతిథులుగా వచ్చి యున్నారు. నాకుగొంచెము ధాన్యమిాయఁగోరెదను. వల యుచో నేమైనఁజాకిరీ చేసెదను.

రత్నా:—చాకిరీచేయుదువని తెలియును. చాకిరీచేయకుండ యెవ్వరు నేమియునీయరుగాని, ఉండుము. ఆయన నడిగిచెప్పెదను.

శంక:—ఎవరు? కుచేలునిభార్య వామాక్షికా? వలదు. ఆసాక్కే మనకు వలదు. ఆమెకు యెంతమాత్రము సాహాయ్యముచేయ వీలులేదు. ఏమి? పొగరా? ఓపికలేనివాఁడా? ఏదైన యుద్యో గము చేసికొనరాదా? ఏమి? చదువురానివాఁడా? పడుచువానికి యిరువదియేడ్గురు పిల్లలుగలవానికి యీకర్మమేమి? భక్తియేమి? ఎన్నిసార్లు చెప్పవలయును? జ్ఞానముండవలదా? అంతమాత్రము తెలియకపోవుటకేమి చిన్నవాడా? విద్యావిహీనుఁడా? మూ ఢుఁడా? నాలుగునెలలఅద్దె బాకీయున్నాఁడే? అంత తిండిలేనివాని కతిథులా? కుచేలునికేగాదు, అతని బంధువర్గములో నెవ్వరికిని గూడ సాహాయము చేయరాదు. అట్లు చేయుటవలనఁ బాపమే సంభవించునుగాని పుణ్యమురాదు. అపాత్రదానము చేయరాదు గదా!

వామా:—అయ్యా! అట్లనజెల్లునా? నానాధుఁడు మూర్ఖాగతుఁడై యున్నవాడు. కనికరించుడు. భాగ్యశాలురు మీరే యట్లు కినుకవహించినచో మేముజీవించుటయెట్లు?

శంక:—భాగ్యశాలురమై జన్మించుట మాయదృష్టము. నీవుపేదలై పుట్టుట మీకర్మము. పేదలకు శ్రీమంతులు సాహాయ్యము చేయవలయునను నియమమొందునులేదు. అట్టే మాట్లాడ నవసరములేదు. వెంటనే వెడలిపోవచ్చును.

వామా:—అమ్మా! రత్నావళీ! నీవైన నీపతికిఁజెప్పుము.

శంక:—అదికాదు. బ్రహ్మావిష్ణుమహేశ్వరులువచ్చి చెప్పినను వినువాఁడనుగాను. తెలిసినదా?

వామా:—సరే. పోయెదను. మాకర్మమెట్లున్న నట్లగును.

(నిష్క్రమించును)

---

## చతుర్థరంగము.

[కుచేలుని గృహమున నారదుఁడు ప్రవేశము.]

నార:—అహా! హృదయవిదారకమైన యీవిచారకర దృశ్యమును నేను గాంచఁజాలను. కుచేలుని భక్తి యనన్యసామాన్యము. అసాధారణము. అపూర్వము. ఈతనికి మోక్షము కరతలామలకము. ఇప్పు డీతఁడు దారిద్ర్యము ననుభవించుచున్నను ముందైనను శ్రీహరి కరుణాకటాక్షము లభింపకపోదు.

మ. కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁడైనట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులో
దలపం దామదిమెచ్చి, యార్తహరుఁడై దన్నైననిచ్చున్న ని
శ్చలభక్తి న్భజియించువారికిఁదే సంపద్విశేషోన్నతుల్.

వామా:—(ప్రవేశించి) నారదమునీంద్రా! నాకేమియుఁ దోఁచకున్నది. ధాన్యము లభించలేదు. అతిధు లీపరికి నదీస్నానము ముగించి వచ్చుచుందురు. నాధుడుమూర్ఛాగతుఁడై యున్నవాఁడు. తన యుఁడు రోగగ్రస్తుఁడై శయ్యపై నున్నాఁడు చూడంజూడ నతని స్థితియు నపాయకరముగఁ దోఁచుచున్నది.

కుచే:—(లేచి) ఏఁడీ! నాప్రభుఁడు, నాదాత, నాతండ్రి, నాకృష్ణుఁడు, ఏఁడీ. ప్రభూ! రాధారమణ! మురళీగానలోల! రమ్ము. దయ చేయుము. నన్ను రక్షింపుము. తండ్రీ! నాపై నింత కాఠిన్య మూననగునా? శిరీషకుసుమ కోమలమగు నీచిత్త మీదీనుని యెడ శిలాసదృశకాఠిన్యము వహించినదేల?

[అతిధులు ప్రవేశింతురు.]

1 అతి:—ఏమికుచేలా! వడ్డనఁజేయింపుము.

కుచే:—మహాత్ములార! కూర్చుండుడు. ఇపుడే నాసతిభోజనము సిద్ధ పఱుపఁగలదు.

2 అతి:—ఏమమ్మా! వంటయింకనుబూర్తి కాలేదా?

వామా:—(సంశయించుచు నిలుచును)

3 అతి:—ఏమిది? అట్లుమాట్లాడ కూరకున్నావు?

(లోనుండి అమ్మా! అమ్మా! జనకా! అయ్యో? దాహము. దాహము)

1 అతి:—ఎవరిమాటలుగది?

కుచే:—నాతనయుఁడు రంగడు వ్యాధిగ్రస్తుడై మరణాపన్నుడై యున్న వాడు. వంటయిపుడే పూర్తి కాగలదు.

2 అతి:—ఏమిది? కుచేలా! సాధుజనులమగు మమ్ము వంచింపచూచు చున్నావా? దివ్యదృష్టిని మేమామాత్రము గ్రహించజాలమని

తలఁచితివా? ఇంతవఱకును వంటయే చేయలేదుగదా! ఎప్పుడు చేయింతువు? చాలుచాలును. ఇదియేనా నీవుగౌరవించువిధానము?

కుచే:—అయ్యా! క్షమింపుడు. ఇపుడేసమస్తము పూర్తి కాగలదు.

రంగ:—(లోనుండి) అయ్యో! బాధ-బాధ-దుర్భరము. జనకా! చని పోవుచున్నాను. రావా. ఒక్కసారిరావా? అమ్మా! అయ్యో!

3 అతి:—ఛీ! నీయింట భుజింపరాదు. ఒకవంక రోగిమూల్గుచు నేడ్చుచుండ మేమెట్లు భుజింపగలము?

1 అతి:—మేమువచ్చియడిగినపుడు నీయశక్తతను వెల్లడించినచో నెంత బాగుండియుండును? ఇపుడు మేమెచ్చటికిఁబోవుదుము. మిట్టమధ్యాహ్నమైనదే. ఏమి యీయన్యాయము?

2 యతి:—నీవింతకన్న పాతకము మూటగట్టుకొనజాలవు. నీకు కుంభీపాక నరకమే ప్రాప్తి.

3 అతి:—ఓరీ ఛండాలుడా! నీముఖముచూడరాదు. మిత్రులారా! రండు పోవుదము.

కుచే:—మహాత్ములారా! ఒకింతశాంతింపుడు. కార్యము సానుకూలముకాగలదు. ఆపరమాత్ముడే-ఆయార్తజనశరణ్యుడే- మీకు సంతుష్టకరమైన భోజనము నిడగలడు.

1 అతి:—నీయాతిథ్యము మాముఖమువలెనేయున్నది. నీవంటి వంచకునకా, యాశ్రీమన్నారాయణమూర్తి దర్శనలాభ మొసఁగునది; చాలు చాలు.

2 అతి:—మేము మొదటనే నీకు మతిచలించెనని యెఱింగి యుండినచో నీయాతిథ్యము నంగీకరింపకపోయియుందుము.

3 అతి:—ఇంత దౌష్ట్యమెందైననుండునా? కుచేలా? ఈపాపము నిన్ను కట్టికుడుపదా?

రంగ:—అయ్యో! దాహము! తాపము! జనకా! సెలవు.

కుచే:—నాతండ్రీ! వచ్చుచున్నాను.

1 అతి:—నిలు. కుచేలా! ఏమి? మాకుఁ దగిన సమాధానమీయకుండఁ గనే పోఁబోయెదవు? ఇంత నిర్లక్ష్యమా? ఇవుడైన మించినది లేదు. క్షమార్పణ వేడుకొనుము.

కుచే:—మహానుభావులార! నేను మిమ్ము వంచించియుండ లేదు. మీకై తెచ్చిన నీవారధాన్యమును ధేనువు భుజించినది. మీ రీసమయమున నేచ్చోటికిఁ బోవలదు. నేను మీకుఁ దప్పక యాతిథ్యమొసఁగువాఁడను. నాయందు దయయుంచి, యొక్క క్షణ మాగినచో నెల్లో మీకాహారమును సిద్ధపఱుతును. నా తనయుఁ డాసన్నమరణుఁడై యున్నవాఁడు గదా.

గీ. నన్ను దయఁగని యొక్కక్షణమ్ము నోర్పు
చెందియుండఁగఁ గోరుదు సిద్ధులార!
ఆరమానాథు కృపచేత నల్పకాల
మందు విందొనరింతు నానందముగను.

శంకరశాస్త్రి—(ప్రవేశించి) ఏమోయీ కుచేల! నామాటయేమి చేసితివి? ఇంకను యద్దనీయనా? ఎంతకాలమిట్లు వేధింతువు? నీకు జ్ఞానములేదా? బుద్ధిలేదా? మనుష్యమాత్రుఁడవు కావా? జంతువు కున్నంత జ్ఞానమైనలేదా? మానాభిమానములు లేవా? పౌరుషము లేదా?

కుచేల:—సోదరా! ఆగ్రహింపకుము. కరుణింపుము. దీనముగ వేడుకొందును. నాచిత్త మస్వస్థముగనున్నది. నాతనయుఁ డాసన్న మరణుఁడై యున్నవాఁడు. నాపిల్లలు తిండి లేక శుష్కించి, వికలాంగులై యున్నవారు. అతిథులు వేచియున్నారు.

శంక:—ఏమైన నాకేమి? అడ్డనీయలేనపు డిల్లుకాళీచేసి వెడలిపోవుట నీవిధి. నాబాకీ తీరువఱకును సామగ్రిని మాయధీనమున నుంచ వలయును. అదిగాక నీతనయుఁ డాసన్నమరణుఁడై యున్నాఁడం టివి. అతఁడు ప్రాణమువదలినచో నిక్షేపమువంటి యీగృహము పాడువడదా?

కుచే:—హరిహరీ! యెంతమాటాడితివి?

శంక:—నీకొక్కటే చెప్పుచున్నాను. ఆహరి నీకెంతమాత్రము సాహా య్యము చేయఁడు రమ్ము. జరాసంధుఁడు దయార్ద్రహృదయుఁడు. నేనుచెప్పి నీకుపకారము చేయింతును. లేదా నాయింటినుండి యీక్షణమే యావలకుఁబొమ్ము. నేనొక్కక్షణమైననింక యూర కుండువాఁడనుగాను. ఇంతవఱకు వేచియుండుటయే చాలతప్పు. మర్యాదగాఁజెప్పుచున్నాను. లేదా నిష్కరుణుడనై నిన్నుగెంటి వైచెదను. తెలిసినదా?

కుచే:—సోదరా! నాతనయునకు స్వాస్థ్యము చేకూరనిమ్ము. ఎటకేని వెడలిపోవుదునుగాని, నాస్వాతంత్ర్యమును—నాస్వేచ్ఛను జంపు కొనజాలను. నాహృదయమును వ్యధితమొనరించుకొనజాలను. నాప్రభుఁడగు ముకుందుని సేవమాని తుచ్ఛనరాధములకొలువ జాలను.

గీ. తనయుఁ డాసన్నమరణుఁడై యున్నవాఁడు
స్వస్థపడనిమ్ము చనెద ప్రశాంతకాన
నాంతరమ్ముల నివసింప; స్వాంతమందు
నరులఁగొల్చెడి బుద్ధియెన్నటికిరాదు.

నార:—(తనలో) ఆహా! ఏమి యీతని దృఢమనోనిశ్చయము? నిక్క వముగా ప్రశంసింపఁదగినది.

1 వ అతిథి:—ఏమి కుచేలా! ఇంత దనుక నీవు నీతనయునకు మాకు మాత్రమే సమాధానము చెప్పవలసియుండగా నిపుడు మఱొక్కనికిఁ గూడ సమాధానము నొసఁగవలసియున్నది. ఇఁక మాకు సెలవిమ్ము. నీవు మాకై వంత నొందవలసిన పనిలేదు. మేము నేఁటికి నిరశనులమైయుందుము.

2 వ అతిథి:—దోషము మాదిగాని నీయం దిసుమంతయును లేదు. మమ్ము పోనిమ్ము. దారిద్ర్యము నీభక్తిని చెఱచుచున్నది. లేకున్న మావంటి సాధుజనుల నెందఱనేని సత్కరించియుందువు.

శంకర:—ఏమి? మఱల నాయోగులతోఁ గూర్చున్నాఁడవు. పోయెదవా లేదా?

కుచే:—అన్నా! మిట్టమధ్యాహ్నము వేళ-భాస్కరుఁడు ప్రచండుఁడై, తీక్ష్ణకిరణజాలముచే లోకమునెల్ల దహించుచున్న యీసమయమున యెచ్చటికిఁ బోవుదును? కృశీభూతమైన శరీరముతో శుష్కించియున్న తనయుని కెచ్చోట విశ్రాంతి చేకూర్తును? నామాట వినుము.

నార:—శాస్త్రీ! నీకిది తగదు సుమా. ఒకింతయైన కరుణచూపుము.

శంకర:—ఓయీ మాయదారి జడదారీ! నీకలహములతో పదునాల్గు లోకములు పెనఁగులాడుచుండుటచేఁ గడుపునిండినది చాలక, యీభూలోకమునకు వచ్చి, నీకలహప్రియత్వము ప్రచారము చేయుచుంటివా? చాలు చాలు. నిన్ను కూడయుపవాసముచేయుటకుఁ గుచేలుఁ డాహ్వానించినాఁడా? నీకుఁ గావలసినంత భోజనము దొరకును. అవంతీనగరమున ఎన్ని కలహాడావిడి తీవ్రముగనున్నది. అచ్చట నీకలహనృత్యమునాఁటితివా కాయలు పండ్లు కావలసినన్ని కాయును.

నార:—సరేలే. నాభోజనమునుగూర్చి నీకు బాధయెందులకు? నిన్ను డుగను సరిగదా!

శంకర:—కుచేలా! రమ్ము న్యాయస్థానమునకురమ్ము. నీది యన్యాయ మని ప్రభువుచెప్పినచో నిన్నువదలిపై చెదను. లేదా నిన్ను నేఁడు పరాభవించి తీఱెదను.

వామా:—అయ్యో! మమ్ము పరాభవించ నక్కరలేదు. మమ్మా గోవిందుఁడే కాపాడక, కాఠిన్యము పూనినాఁడు.

శంకర:—నిన్నవమానించ వలయునా? నాయింటిలోనుండి వెడలి పోయెదవా? లేదా?

1వ అతి:—కుచేలా! ఈతగవు నెట్లో పరిష్కరించుకొనుము. మేము పోయెదము.

వామా:—అయ్యో! తనయునకు మాఁగన్ను వడినది. జీవించునో లేదో (ఏడ్చును.)

శంకర:—నాయింట రోదనధ్వని వినబడరాదు. ఎట్టి యమంగళమును కంటబడరాదు. పొండు. పొండు.

(కుచేలుని యావలకుఁ ద్రోసివేయును. కుచేలుఁడు క్రిందపడిపోవును.)

కుచే:—ప్రభూ! ప్రభూ!

శంకర:—నీప్రభువునువచ్చి రక్షించమని ప్రార్థించుము.

(తన్ని మఱల పడద్రోయును.)

కుచే:—అహో! ఆనందము. బ్రహ్మానందము. కృష్ణా! సకలలోకాధి నాధా! నిరతిశయానంద మనోజ్ఞమూర్తీ! గభీరపారావారమధ్యమ్మున శేషశాయిపై శయనించియుండు మోహనవినీల జలధర మూర్తి! భక్తుఁడనగు నేనిట దైన్యావస్థలోనుండ నీవేమిచేయు చున్నావు? నీలీలలగాంచి నీలోనీవేనవ్వుకొనుచున్నాడవా? మధుర

మందహాసచంద్రికావికసితవదనాంబురుహుఁడవై నా కష్టము ల కన్గొనుచు 'యిది భక్తిపరీక్ష'యని శిరముపంకించుచున్నావా? దిగంతరాళప్రతిధ్వనితమైయొప్పు నాయాక్రోశము అప్సరోగీతికా యత్తమా నీవీనులజొచ్చుటలేదా? హేప్రభూ! నిన్ను మనసార ధ్యానించుచున్నాడను. కనజాలవా? ఏల నీకీయశ్రద్ధ! నాసంతాపము—నాహృదయమును దహించు నీదారిద్ర్యానల జ్వాలలను-గాంచి నిరవధికానందభరితాంతఃకరణుడవగుచున్నాడవా? తండ్రీ! నేనికనిలువలేను. ఒక్కయడుగైననిడలేను. నన్నురక్షించుభారము నీది-నీది-నీదియని యెలుగెత్తి చెప్పుచున్నాను. నామాటలు నీకు వినబడుటలేదా? నాపాపమాయిది? నాతండ్రీ! నీవింకను యుపేక్ష వహింతువా? దయార్ద్రహృదయుఁడవని పతితపావనుఁడవని భక్తాగ్రగణ్యులు పల్కునది యసత్యమా? వసిష్టాగస్త్యాది మహాతపోధనులగు మునుల ఘోరజపతపములకు సంతసించి సాక్షాత్కారమొసంగితివని వింటి నదియు కల్లయేనా? ఒకవంకభగవత్స్వరూపులగు నతిథులు-ఒకప్రక్క-ద్విజోత్తముడు-మఱొక్కెడ నంత్యావస్థలో దనయుడు-తండ్రీ ఇంక నీపరీక్షకు దాళజాలను. నన్నీయవమానస్థితినుండి తప్పించకున్న-చో నీవెచ్చటను లేవనియే స్థిరీకరింతునఃసుమా. కృష్ణా! ఆపదుద్ధారకా! హేసర్వాంతర్యామీ! నీవులేవు. ఈజగత్తుమిథ్య. సర్వము మిథ్య. నేను నిక్కముగా నీవేరక్షకుడవని విశ్వసించి సంపూర్ణముగావంచింపఁబడితిని.

(పడిపోవును.)

(శ్రీకృష్ణుఁడు సాక్షాత్కరించి పంచభక్ష్యపరమాన్న సహితమైన పళ్ళెరము వామాక్షి కొసఁగును.)

వామా:—పరమాత్మా! ధన్యనైతిని.

కుచే:—(లేచి) ఏఁడీ? నాస్వామి యెందేగెను? ప్రభూ! నేను నిన్ననుసరించివచ్చుచున్నాను. ప్రేయసీరమ్ము. మనమిచ్చోట నొక్కక్షణమైన వసించుటకు తావులేదు. ఆపరమాత్ముఁడు మనల నెట నివసింపుమని యజ్ఞాపించునో యచ్చటకే పోవుదము. ముందుగా నతిథుల సత్కరింపుము.

శంకర:—(తనలో) ఏమి యీయద్భుతము. ఎవ్వరునిచట నాకుఁ గాన్పింపలేదు. ఎట్లు పంచభక్ష్యపరమాన్న సహితమైన భోజనమేర్పడినది? నిజముగా వాసుదేవుఁడే సాక్షాత్కరించి, యీపల్లెరము నొసఁగియుండునా? అయినను కుచేలుని బాధింపక విడువరాదు. (ప్రకాశముగా) కుచేల! నాబాకీనీయక యెటకేగెదవు?

కుచేలు:—సోదరా! నాయింటనున్నదంతయు నీయది. సకుటుంబముగా కట్టుబట్టలతోఁ బోవుటకుమాత్ర మనుజ్ఞనిమ్ము. నిర్జనారణ్యమున వసించుట కొరుల యాజ్ఞ యవసరము లేదుగదా! ఇఁక జీవించుటయా? ఆపరమాత్ముఁడే - ఆనందనందనుఁడే కలఁడు. వనములో పక్షులను, జంతువులను, వృక్షములను నెవరు రక్షించుచున్నారో, యట్టి దేవదేవుఁడే మనల రక్షించును. క్షేత్రములనే దయార్ద్రహృదయుఁడు సస్యశ్యామల మొనరించుచున్నాఁడో, పిపీలికాది సర్వజంతుజాలమునకు నెవ్వఁడాదరమతి నాహార మిడుచున్నాఁడో యానందనందనుఁడే నన్ను రక్షించును.

చ. ఉరు గహనాంతరమ్ములఁ మహోగ్రతఁబొలు స్రవంతిచెంగటన్
పరమ భయంకరమ్ములయి వర్తిలు పర్వతప్రాంతసీమలన్
అరయుగ నిర్జనమ్ములయి యాత్మకు భీతి ఘటిల్లఁజేయు నే
నిరవున నైన నుండు కరుణింపుము పాదములంటి వేడెదన్.

శంక:—సరే! ఎట్లు వెడలెదవో చూచెదగాక!

[తెలుపడును.]



ఓం

అవిఘ్నమస్తు.

శ్రీరామాయనమః

# భక్తకుచేల నాటకము.

## చతుర్థాంకము.

---

### ప్రథమరంగము.

[ద్వారకలో శ్రీకృష్ణుఁడు, రుక్మిణీ, సత్యాభామాది సతులతో ప్రవేశించును.]

శ్రీకృ:—ప్రేయసీ! సత్యా! కుచేలుని భక్తిని పరీక్షించుటకై చాల దినమునకుఁ బూర్వము నారదముని భూలోకమున కంపియుంటివి గదా! అతఁ డింతవఱకును రాలేదేల?

సత్య:—నాథా! కార్యము సానుకూలమైన పిమ్మటనే గదా, యా మునీంద్రుఁడు తిరిగివచ్చుట? అయినను మొన్న మొన్ననే గదా యతఁడు మర్త్యలోకమునకుఁ జనినది?

రుక్మి:—ప్రాణేశ్వరా! అట్లయిన భక్తియే జయించినదని చెప్పవచ్చును గదా! ఆహా! భక్తిని మించిన పదార్థ మీచతుర్దశభువనములం దెచ్చటను లేదుగదా నాథా! భక్తిపాశముచేతనే గదా

ధ్రువుఁడు, బాలభక్తుఁడైన ప్రహ్లాదుఁడు, అంబరీషుఁడు మున్నగు వా రెందఱో నిన్ను బంధించిరి? వేయేల? తుచ్ఛమగు భోగములకంటె, నైశ్వర్యముకంటె, ప్రణయముకంటె భక్తియే యసదృశమైనది.

గీ. అలమహామహుఁడైన యయ్యంబరీషుఁ
డెలమి మకరికిఁ జిక్కిన యేన్గురాజు
బాలుఁడైన ప్రహ్లాదుండు ప్రాణనాథ
నిన్ను బంధింపలేదె నిర్నిద్రభక్తి?

సత్య:—నాథా! భక్తిప్రేమల తారతమ్యము నరయుటకేగదా నేను బ్రతిమాలి నారదమునీంద్రుని పంపితిని? ఇంతలోనే నైదర్భియిట్లు పలుకసాహసించుట కయ్యమునకు కాలుద్రవ్వుటయేగదా! ఇది నీకు న్యాయమా!

[తెలుగు గోవిందంభజరే-హేగోపాలంభజరే]

అనుబంధము 9.

శ్రీకృ:—మీరిక శాంతింపుడు. దేవర్షియగు నారదమునీంద్రుడు వచ్చుచున్నాడు.

నార:—(ప్రవేశించును.)

శ్రీకృ:—మహర్షిసత్తమా! ఇన్నిదినము లటనుండుటవలన నేమైపోయి నావోయని యాందోళన మొందినాము.

కౌశి:—నారదమునీంద్రా! గోవిందునిమాటకేమిగాని-నిన్నుజూచినదో నాకు భయముకలుగుటకు హేతువేమో చెప్పజాలవా?

నార:—అక్కటా! ఇది నాపాపమా? కలహాశనుఁడనగు నేను కాలయమునివలె యందరకును భయానకముగ గాన్పించుచున్నాను కాబోలును,

సత్య:—బ్రాహ్మణుఁడా! పానకములో పుడకవలె నీవడ్డురాకుము. నారదమునీంద్రా! ఏమిజరిగినదో చెప్పి నాకానందము కలిగింపుము.

రుక్మిణి:—మహర్షిచంద్రమా! భక్తియోగమే యుత్తమోత్తమమైనదని స్థిరీకరించుకొని వచ్చియుందువా?

నార:—నాతల్లులారా! మీలో నే నెవరిపక్షమూని మాట్లాడినను మఱొక్కరికి కోపము తప్పదు కావున నట జరిగినదిమాత్రమే చెప్పి యూరకుందును. భక్తియే శ్రేష్టమో, ప్రణయమే మధురమో మీరే నిర్ణయించుకొనుట క్షేమకరము. కుచేలుఁడు మహాభక్తుఁడగుట నిస్సంశయము.

సీ. కఠినాత్ముఁడైన శంకరశాస్త్రి కల్పించు
బాధల నోర్పుతో పడెనతండు
కడ కొక్కపూటయుఁ గడుపునిండుగ భోజ
నములేక యున్నదినమునగూడ
శ్రీహరికథలెల్ల శ్రేష్టుకాద్విజులకు
వినిపించెనాతండు వేడ్కతోడ
అతిధులు చనుదెంచు నవసరమ్మునగూడ
శ్రీకృష్ణు చింతయే చేసెనతఁడు

గీ. తనదుతనయుండు రోగమ్ము ననుభవింప
దేవదేవుండు శ్రీశుండె దిక్కటంచు
వెతలనన్నిటినహియించి యతులభక్తి
నలరుచుండె కుచేలుఁ డక్కజమునొంద.

అట్లయ్యును వాసుదేవుని కటాక్షవీక్షణ మింతదనుక నతనిపై నేలప్రసరింపలేదో తెలియకున్నది. శంకరశాస్త్రియను జరాసంధ శిశుపాలుర యాశ్రితుఁడొక్కఁడు కుచేలుని దుస్సహములైన యిడు

మలపాల్జేసెను. అట్లయ్యును నాభక్తాగ్రగణ్యుఁ డీసుమంత యైన చలింపక నిరంతర హరిచరణారవింద సేవాతత్పరుఁడై యుండె. ఆహా! ఏమని యాతని దృఢమనోనిశ్చయమును గొనియాడ వచ్చును? నందనందనా! నీకేల యీమూకీభావము? ఆతని కింకను కష్టము లెందులకుఁ కల్గింతువు?

శ్రీకృ:—నారదమహర్షి చంద్రమా! ఆతఁడు నిశ్చయముగా భక్తుఁడే. కాదననుగాని, యీదారిద్ర్యానుభవము కారణరహితముకాదు. అతఁడు పూర్వజన్మమున నైశ్వర్యమదోన్మత్తుఁడై నన్ను సేవింప నందున నీజన్మమున కష్టపరంపర నెదుర్కొనవలసివచ్చినది. ఇఁకెంతకాలమో యాతఁడు సిలుగులఁ గాసిఁ జెందనక్కఱ లేదు. అచిరకాలముననే యాతఁడు నాదర్శనమునకు రాఁగలఁడు.

సత్య:—అట్లయిన నామాటయేమి?

రుక్మి:—ఏమైనది? భక్తియే విజయము గాంచినది.

సత్య:—నిజమా! నాథా! నీవు మాట్లాడక యట్లు నిశ్చలముగాఁ గూర్చుందువేమి?

శ్రీకృ:—వాదన కిది సమయముకాదు. ఘోరదారిద్ర్యమగ్నమాన సుఁడై దుఃఖాతిశయమున భూనభోంతరములు మాఱుమ్రోగు నట్లు విలపించుచున్న యాకుచేలుని రక్షింప నాచిత్తమెంతయు దత్తరపడుచున్నది. నారదా! లెమ్ము. పాపము! నిర్మానుష్య మగు కాననమున కుచేలుఁడు సకుటుంబముగ నొకవృక్షచ్ఛాయ నుపవసించియున్నాఁడు. మునీంద్రా! పాపము. కుచేలుని తనూ భవుఁ డాసన్నమరణుఁడై యున్నవాఁడు. ఆతఁడు మృతినొందఁడు. నీవేగి, వామాక్షితోఁ బతినెట్లయిన నాకడకనుపుమని చెప్పిఁ పంపుము.

నార:—ధన్యోస్మి. సర్వసంగపరిత్యాగినయ్యు, నామహాభక్తుని కష్టములఁ జూచునరికి చిత్తము చెప్పరాని యావేదనము చెందినది.

ఉ. ఆతఁ డనేకరీతుల నహర్నిశముఁ నినుగొల్చుచుండ నో
పాతకవైరి బాధల నహారిగఁగల్గఁజేయుదేల నో
పూతనప్రాణహారి పరిపూర్ణతనొందె కుచేలుభక్తియుఁ
బూతచరిత్రుఁ డాతఁడిఁక పొల్పుగనేలు కృపామతిఁ ప్రభూ.

నేనిఁక పోయివచ్చెదను. అమ్మా! సత్యాదేవీ! రుక్మిణీదేవీ! మీరిఁక కలహింపకుఁడు. అచిరకాలమున నాకుచేలుఁడు మీప్రాణనాథుని సన్నిధికరుదెంచినపుడు మీరే భక్తి ప్రేమలలో నేది మహోత్కృష్టమైనదో నిర్ణయించుకొనవచ్చును.

(నిష్క్రమించును.)

అనుబంధము 10

శ్రీకృ:—(తనలో) కుచేలునిరాకతో సత్యాదేవి గర్వభంగనాటకము సమాప్తము కాఁగలదు. చెలులారా! నేఁడు మనము యమునానదీ తీరమునకుఁ బోవుదము. బాల్యమున నానదీ సైకతస్థలుల నాటలాడియుంటిమి. మఱల నొకసారి చూచి రావలెనని యున్నది.

సత్య, రుక్మిణి:—చిత్తము. మహాభాగా! అనుగ్రహింపఁబడితిమి.

[తెఱపడును.]

---

ద్వితీయరంగము.

---

[శంకరశాస్త్రిగృహము—ప్రవేశము రత్నావళి]

రత్నా:—ఏనాఁడుచేసినపాపమో యీనాఁ డనుభవించుచున్నాను. అనుభవించునది భయంకరదుస్సహదారిద్ర్యమైనను, వామాత్మీయు

గుచేలుడును జిలుకగోరువంకలబోలె, రతీమన్మథులవలె సంతానవంతులై సుఖముగనున్నారు. దారిద్ర్య మనునది లేనిచో నాదాంపత్య మనుపమానమై, యసదృశమై వెలయగలదు. నా భర్త ముదుసలి. కర్కోటకుఁడు. కఠినాత్ముఁడు. ప్రేమానురాగశూన్యుఁడు. ఈదాక్షిణ్యహీనునితో-ఈమూర్ఖునితో- జీవితాంతమువఱకు నెట్లుగడుపుదును? ఓతలిదండ్రులారా! ధనాశాపరులై కన్నకుమార్తెను విక్రయించుకొనిన యీపాతకము మీరుత్తర జన్మమునసైన ననుభవింపకపోరు. సౌఖ్యములేని కాపురమేల? ఎంతధనమున్న నేమి? ఒక్కనగచేయించమని యడిగిననాల్గురోజుల వఱకును సాధింపే. చల్లనిమాటలేదు. ఎంతసేపునవరినిబాధింతునా యను నాలోచనయే. అన్నియు దప్పులే. వీధిలోనిలుచున్నదోపమట. చక్కగానలంకరించుకొనుట తప్పట. ఏమైననుసరే. నేఁడు మనోహరముగా నలంకరించుకొందును. (అలంకరించుకొనును.)

శంకర:—(ప్రవేశించి) ఎవరితోనోమాట్లాడుచున్నట్లున్నది? ఎవరితోనే?

రత్నా:—రామరామ. ఇదేమికర్మము. నేనెవ్వరితోను మాట్లాడనిదే యనవసరముగా నీనిందాలాపమేమి?

శంక:—సరే. దానికేమిగాని, యీయలంకరణవిధానమేమి? ఈప్రక్కపాపిట తలదువ్వుటేమి? ఈపూలుముడుచుటేమి? పైటనానుదియేమి? ఈముస్తాబంతయు నెందులకు? ఎవరికొఱకు?

రత్నా:—ఎవరికొఱకో. మీకేల? నేనలంకరించుకొనుట దోషమైనదా? ఆడకన్నులకు నే నలంకరించుకొనుట కిట్టదుకాఁబోలు.

శంక:—అదేమే. పరిహాసమాడుటకూడ యపరాధమేమైనచో నెట్లు?

రత్నా:—పరిహాసమాడినను కడుపునిండిపోవును. నాముచ్చటలేమియు దీర్పరాదుగాని మీముద్దులన్నియు నేనుచెల్లింపవలెనా? ఒక్కనగ చేయించరు; ఒక్కచీరకొనరు.

శంక:—నీవొక్క ర్తెవుతప్ప మఱెవ్వరును దినదినమును నగలుచేయించు మని, చీరలుకొనుమని మగలను బాధింపరు. ఉన్నదానితో గడపుకొనుటయే భర్తృసేవాపరతంత్రలగు భార్యలలక్షణము. ఆకుచేలునిభార్య వామాత్మనిచూడుము. సద్గుణఖనిగదా!

రత్నా:—ఆపేరుతలపెట్టుటకైన మీకుసిగ్గెలేకపోయినది? మిట్టమధ్యాహ్నమువేళ వారుభోజనమైన చేయకుండ యింటినుండి వెడలగొట్టినారు. ఎంతపాపము. ఆపాతకము కట్టికుదుపకపోదు.

శంకర:—దానికేమిగాని మాట. చెవిలోఁ జెప్పవలసిన రహస్యము.

రత్నా:—(సమీపించి) నారాయణ! స్వామీ! ఆపరమరహస్యమును దూరమునుండియే చెప్పి, నన్నుద్ధరింపుఁడు. ఆదుర్గంధము నేను భరింపఁజాలను.

శంకర:—అట్లయిన నాపూలను దీసివేయుము.

రత్నా:—అదే యేదుపు. ఇవిగో-మీమొగమునఁ గట్టికొనుఁడు. (దండత్రెంపి, గిరవాటువేయును) నేను మీతో బాధపడలేను. మీదారిమీది. నాదారినాది. నేను బుట్టినింటికిఁ బోయెదను.

శంక:—అయ్యో! నీమొగాన నెంతో ధనము పోసినానే. ఇప్పుడు నన్ను నట్టేటముంచి వెడలిపోయెదవా? నీపాదములను బట్టుకొని బ్రతిమాలెదను. నిన్నేనమ్ముకొనియున్నాను. నన్నుగాధమునఁ ద్రోసివేయకుము. (ఏడ్చుచు బ్రతిమాలును.)

రత్నా:—(నవ్వుచు) మఱి నగలు చేయింతురా?

శంకర:—నేఁడే—

రత్నా:—చీరలో—

శంకర:—ఇదిగో. ఇప్పుడే బజారునకుఁ బోయి—

రత్నా:—సరే. ఉండెదను. ముందు చీరలు—

శంకర:—ఏదీ! ఒక్కముద్దు.

రత్నా:—తెచ్చిన పిదప—

శంకర:—ఆఁ—

రత్నా:—ఆఁ లేదు. ఈఁ లేదు.

(తెఱపడును.)

---

తృతీయరంగము.

---

[అరణ్యమునఁ గుచేలుఁడు, వామాక్షి, పుత్రులతోఁ బ్రవేశము.]

వామా:—మార్గాయాస ఖిన్నుండై ప్రాణేశ్వరుఁడు నిద్రాముద్రితుఁడై యుండె. పసిపాపలు భోజనమునకై యేడ్చియేడ్చి నిద్రించినారు. నాథుఁడు నిద్రనుండి మేల్కాంచిన యనంతరము నీవార ధాన్యముఁ గొనిరావలయును. అక్కటా! తండ్రి పడు కష్టములచే కలఁగిన హృదయముతో మాధవుఁడుకూడ నీవారధాన్యమును గొనిరా నరణ్యమునకుఁ బోయి చాలతడవాయె. ఈదారిద్ర్యమిఁక నెన్నఁటికినిఁ దొలఁగదనియే నాయుద్దేశము. నా కడుపునఁ బుట్టి యీపసిపాపలు కూడ క్షుధార్తులై బాధపడుచున్నారుగదా!

సీ. సుతులు తిండియులేక శోకించుటనుజూచి
కఠినచిత్తంబైన కరగిపోవు
తనతండ్రి కష్టంబు కనులార గనలేక
తనయు డేగిరిగదా వనములకును
కంటకంబులబాధ గాసిలి జనుడెంచు
కాంతు కన్గొనినంత స్వాంతమెల్ల

శోకవ్యాకులవతాను లోకవిరుద్ధమ్ము
గాకున్న నిదియేమి కర్మమొక్కొ.

గీ. అఖిల లోకాధినాథుఁడై యార్తజనుల
పాలి కల్పవృక్షంబు నా బరఁగువాఁడు
పరమ కరుణాంతరంగుఁడా భవవిదూరుఁ
డేల రక్షింపఁబూనడో యెఱుఁగఁజాల.

మాధ:—(ప్రవేశించి) అమ్మా! నీవారధాన్యము గొనివచ్చినాను, త్వరగావంటచేసి జనకునిమేల్కొలుపుము.

కుచే:—(నిద్రలో) కృష్ణా! ఆపద్బంధూ! దీనదయాళూ!

వామా:—ఆహా! జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందుగూడ నావరం ధాముని నేదలఁచుచుండు నీమహానుభావునకు భార్యనై జన్మించుట నాపూర్వజన్మసుకృతముగదా!

రంగ:—(లేచి) అమ్మా! ఆకలివేయుచున్నదే.

కుచే:—నాయనలారా! అమ్మవంటచేయుచున్నది. కొంతసేపు వేచియుండుడు. నేనిపుడే స్నానముచేసివచ్చెదను.

మాధ:—నాన్నగారూ! నాకుజాల నాకలిగనున్నది.

కుచే:—నాతండ్రీ! నీవు ప్రాపంచకజ్ఞానమెఱిగియున్నవాడవుగదా. హరిభజనమే నీకు సమస్తము నొసగును. ఆకలిమాన్పును. దాహబాధ నుపశమింపజేయును. హరినామామృతమాధుర్య మనన్యసామాన్యము. అసాధారణము. ఓయదునందనా! సకలజీవరాసులు నీకృపావిశేషముచేతనే జీవించుచున్నవి. నీతనయులమగు మమ్మేల కాపాడవు? ఓజగన్నాటకసూత్రధారీ!

గీ. ఈజగన్నాటకరంగమం దీవు భిన్న
భిన్నవేషముల చిత్రవిచిత్రగతుల

దాల్చి యాడింతువౌర ప్రదర్శనమ్ము
అహహా! నీలీల లివ్వియేమనగవచ్చు?

అదియునుగాక తనయా! శ్రీరమామనోహరునిస్మరించుటవలన గలుగులాభముల నెరిగింతు నాకర్ణింపుము.

తే. గీ. కలిమిలేములు తిరమయి వెలయవంచు
మదిదలంచినవాడెనూ మాన్యుడగును
అంబుజోదరు దివ్యపాదాంబుజములు
గొలిచినంతనె పాపముల్ తొలగిపోవు.

వామాక్షీ! ఏమది? నీవిశాలనయనములు దుఃఖాశ్రుప్లావితములై యున్నవేల? కన్నకుమారులు దారిద్ర్యముచే దిండిలేక మలమల మాడుచున్నారను సంతాపమే నీకు దుఃఖము నాపాదించియుండ వచ్చును. అబలా! విద్యావతివి. వివేకవతివి. బేలతనమువహించి నీవేయిట్లుదుఃఖితవగుచో బసిపాపలూరకుందురా? నిక్కము వచింపుమందువా? హేయములగు భోగభాగ్యములకంటె నీ దారిద్ర్యమే శ్రేయస్కరమైనది. ఏలనందువా? భాగ్యము మనల గర్వాంధులజేయును.

చ. అరయగ భాగ్యభోగము లవాంతరముల్ కడుగూర్చుభక్తితో
నరసిన లేమియే సతము నవ్యయసౌఖ్యమొసంగుచుండు నీ
పరమసుఖాస్పదంబునయిభాసిలు సూక్ష్మము గుర్తెఱింగి య
ప్పరమదయానిధిం భవప్రభంజనుగొల్చుట కర్జమానుమిూ.

అదియునుంగాక భాగ్యభోగములు శాశ్వతములుకాదు. సంసారము విచారమునే నిరంతరము నాపాదించునుగాని సుఖము నీయదు. సూనృతవాక్పరిపాలకుడని యనంతయశస్సముపార్జన మొనరించిన హరిశ్చంద్రభూపాలుఁడు విధివశమున సకలసంపదను

బాసి, రాజ్యపరిత్యాగిప్తెు, కానలకుఁ బోలేదా? నిషదాధిపుఁడు నలుఁడు వంటలవాఁడు కాలేదా?

గీ. అల హరిశ్చంద్రనృపతి సత్యమ్ముకొఱకు
రాజ్యమునురోసి, సతిని విక్రయమొనర్చె
కాలమహిమ గాకున్న యన్నలవిభుండు
సాధ్వి దమయంతి నక్కాన చనునె విడిచి?

నేను స్నానముచేసి వచ్చెదను. (నిష్క్రమించును.)

అనుబంధము 11

[తెఱలో:-హరిచరణాంబుజసేవనమేయిల-పాట.]

వామా:—నారదమునికులతిలకుఁ డరుదెంచుచున్న ట్లున్నది.

నార:—(ప్రవేశించును.)

వామా:—మహాత్మా! మత్ప్రణామములగొనుము. ఈకృష్ణాజినముపై గూర్చుండుడు.

నార:—సౌభాగ్యవతీ! సర్వసంగపరిత్యాగినగు జడదారినయ్యు, యే లోకో నీనాధునియెడల నాచిత్తమున నాదరాభిమానము లేర్పడి నవి. నేనొకమాటచెప్పెదను. వామాక్షీ! ఈదారిద్ర్యము మీ కుటుంబమునుచీల్చి పిప్పిచేయుచున్నది. బాల్యమున నీపతియు ద్వారకాపురీశుఁడగు శ్రీకృష్ణుడును సాందీపునియొద్ద విద్యాభ్యాస మొనరించినారు. ఆమహానుభావుని దర్శన మొకతూరిచేసినంతనే మీకుసంపదలు కరతలామలకమగుగాదే? ఎట్లయిన నొక్కసారి ద్వారకకుబోయి యాభక్తవత్సలుని చూచిరమ్మని నీపతికి నచ్చ చెప్పి పంపుము.

ఉ. వదలితి సర్వసౌఖ్యములు వారిజలోచను గొల్వనెన్నఁడో
సదయమతీ నినుంగని ప్రశాంతహృదంతరము స్థలంగె నీ
యదనున ద్వారకాపురికి యబ్జవిలోచను దేవదేవు శ్రీ
పదములఁ జూచిరమ్మనుచు భర్తను బంపు శుభంబు గల్గెడుఁన్.

వామా:—మునీంద్రా! మీహితవాక్యము లమృతమధురములై తోఁచి నవి. తాము చెప్పిన దొప్పునట్లే జేయుదును.

నార:—నాకుఁ బనియున్నది. నేను మఱలవచ్చి కలసికొందును.

వామా:—మునిచంద్రమా! నానాథుఁ డిప్పుడె రాగలరు. మాయాతి థ్యము స్వీకరింపఁగోరెదము.

నార:—అమ్మా! సంతోషము. నీపతి ద్వారకనుండి తిరిగి వచ్చిన పిదప, తప్పక మీయింట పదిరోజులు భుజింతును.

(పాడుకొనుచు నిష్క్రమించును.)

[కుచేలుఁడు ప్రవేశించును.]

మాధ:—జనకా! నారదమునీంద్రులు వచ్చి, యిప్పుడే వెడలిరి.

కుచే:—ప్రేయసీ! అమ్మహాభాగున కాతిథ్య మొసఁగుట కేల యాహ్వా నింపవైతివి?

వామా:—ప్రాణేశ్వరా! అట్టిలోపము నాలో నెన్నఁడునుండదు. ఆ ఋషీ శ్వరుఁ డెప్పుడో తనయిచ్ఛవచ్చినప్పుడు పదిదినములు భోజన మొనరించునట.

కుచే-పిల్లలు:—(భుజించుచుందురు.)

వామా:—నాథా! ఈపూట వండిన యీయన్నముతో మీకును బిల్ల లకును నేమంత కడుపు నిండినది? ఈదారిద్ర్యమును బాపుకొను యుపాయమేదియైన యాలోచింపరాదా? ఈదారిద్ర్యము దుస్స హాముగనున్నది. తనయులవలననే గదా తలిదండ్రులకు సద్గతి లభించుట? అట్టి సుకుమారులగు పుత్రులు తిండికి మొగమువాచి, మృత్యుదేవతా కరాళదంష్ట్రలఁ జిక్కుట మనకు మోక్షసాధక మగునా?

కుచే:—సతీమణీ! నీవు చెప్పునది నిజమేగాని నేనేయుపాయము నూహింతును? దయామయుడగు నాసర్వేశ్వరుఁడే మనసంతా

పము బోనాడవలయును. ప్రమేయ ప్రభావభావనాతీతుండగు నాశౌరియే మనల నీవిచారార్ణవమునుండి తరింపఁజేయవలయును. ఆభక్తపరిపాలన దీక్షాదక్షుఁడు-ఆయార్తజనరక్షణదీక్షాపరతంత్రుఁ డాగోవిందుఁడే మనకు మార్గదర్శి కావలయును. హేప్రభూ! జగదాధార! హేచిదానందస్వరూప! నిన్ను గొల్చుటయే నాకుఁ బరమావధి.

ఉ. ఏమితపంబు సల్పి జనియించినవారలొ భక్తశేఖరుల్
కామితసిద్ధిదాయకు నఖండగతిన్ భజియించి మున్ను సం
తాపముబాయ నారదుఁడు తామసహీనుఁడు గౌతముండు నా
పాపప్రభంజనున్ గొలుతు పాతకముల్దయ బోనడంపగన్.

ప్రేయసీ! ఈదారిద్ర్యాంధకారమునుండి మనము తొలఁగిపోఁగల యుపాయమేదైన నీకుఁ దట్టియున్న యెడలఁ జెప్పుము. ఆయుపాయము సమంజసముగ నున్నచో నట్లుచేయుదము.

వామా:—అట్లయినఁ జెప్పెదను. కోపమునొందరాదు సుడి. ద్వారకానాధుఁడు శ్రీకృష్ణుఁడు మీసహాధ్యాయిగదా!

గీ. బాలసఖుఁడైన యప్పద్మపత్రనేత్రుఁ
గాన నేగి దారిద్ర్యాంధకారమగ్ను
లైన మము నుద్ధరింపుము హరికృపాక
టాక్షరవిదీప్తి వడసి మహాత్మ నీవు.

ప్రాణేశ్వరా! ఆమహాభాగుఁ డేమనుకొనునో యని మీరు సంశయించనక్కఱలేదు.

చ. వరదుఁడు సాధుభక్తజనవత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడు దా గుశస్థలీ
పురమున యాదవప్రకరము ల్భజియింపఁగ నున్నవాఁడు పో
వరిగిన మిమ్ముజూచి విభుఁ డప్పుడయిచ్చు సమానసంపదల్,

కుచే:—ప్రేయసీ! నీవనినది సత్యమే గాని యానందనందనుని మోక్ష మిమ్మని యడుగుట న్యాయముగాని, తుచ్ఛములగు నైహికైశ్వర్యభోగములఁ గోరుకొనుట ధర్మమా? పుట్టించినయాతఁడే పోషించునుగదా!

వామా:—అది సత్యమే కాని నాథా! మన మెన్ని సిలుగుల ననుభవించుచున్నారము. పసిపాప లన్నమునకుఁ గూడ మొగము వాచిన విషయము మీరు కనులారఁ గాంచుచునే పరమాత్ముఁడే పోషించుననవచ్చునా? అడుగనిదే యమ్మయైనఁ బెట్టదు గదా! చూడుఁడు, తినుటకుఁ దిండిలేదు. విశ్రమించుటకు గృహములేదు. ధరించుటకు వస్త్రములులేవు. చలిచేఁ గుమారులు బాధపడుచుండుట-కటిక నేలను శయనించుట-కంటకాన్విత పథంబులఁ గ్రుమ్మరుట-మీచిత్తమున జాలి నుత్పన్న మొనరించుటలేదా?

కుచే:—సతీమణీ! సంసారము సాగరమువలె గభీరమైనది. దుఃఖము నాపాదింపఁగలిగినది. భార్యాపుత్రులని ప్రాకులాడు టేల? ఇది యంతయు మిధ్యకాదే. ఈజన్మమున దారాపుత్రాదులుగనున్న నీవు-సుతులు-గతజన్మంబున నెవ్వరోగదా! అయినను శ్రీకాంతుని మోక్షధనమునకై యాశ్రయింతునుగాని యైశ్వర్యమునకు యాచింపను.

వామా:—అయ్యో! ఆమాధవునికల్యాణస్వరూపమునుగాంచుటయే మంగళప్రదమని నుడివితిరిగాని యామహామహుని దర్శించి ధనమును యాచించుమంటినా?

కుచే:—(యోచించి) ప్రేయసీ! నీవనినది సమంజసముగనున్నది. వైకుంఠేశుఁడగు నాహరి మర్త్యత్వముబూని శ్రీకృష్ణుఁడై యవతరించిన యీయదనున నాతనింజూడకపోయినచో నికెన్నఁడాయుమ

భూమణువిదర్శనలాభ మొదవునుకి ఆహా! ఆయదుకులాలంకారుని పరమపవిత్రసువర్ణ నామాక్షరముల దలచుకొనినంతనే శరీర మానందపులకాంకితమగుచున్నది. బాల్యమున నాశ్రీకృష్ణునితో గలిసి యాడినదినము లేదినములు.ఆదినములు సుఖస్వప్నసదృశమై పోయినవి. యమునానదీ సైకతస్థలుల శారదయామినీసమయముల మధురమోహనమంజులమైన మురళిమ్రోయించి యతఁడు మాకందఱకు నిరతిశయానందము కల్గించెడివాఁడు. గురుపూజకై మేము కాననాంతరములకరుగ శిరీషకుసుమకోమలుడగునాతడు కూడ మాతో వచ్చెడివాఁడు.

గీ. బాల్యమున నెప్పుడో సహపాఠినైన
నన్ను మఱువకయుండునే నళిననేత్రుఁ
డతివ! యంతిపురమ్ముల ననవరతము
వానమొనరించు శ్రీకృష్ణప్రభువు నన్ను.

నిక్కమము దాపక చెప్పుచున్నాఁడను. కాని సఖీ! నాహృదయము నొక్కసంశయము పీడించుచున్నది. చిన్ననాఁడు సాందీపునియొద్ద చదువుకొనిన విషయ మావసుదేవనందనునకు జ్ఞప్తి యుండునా? వజ్రవైడూర్యగోమేధికపుష్యరాగాది దివ్యమణిగణవినిర్మితమును, చంద్రకాంతశిలావినిర్మితమును నగు నంతఃపురమునఁ బదునాఱువేల గోపికలఁగూడి పరసల్లాప నిమగ్నుఁడై యానందజలధితరంగమాలికలఁ దేలియాడు నాపీతాంబరధారి దర్శనము సులభసాధ్యమగునో లేదో,

భామా:—ప్రాణనాయకా! అట్టి సందియమువలదు. ఎఱుక పిడికెడు ధనమని పెద్దలు చెప్పుదురు. ఆవాసుదేవునకు మీాయందధికానురాగము కలదు. మిమ్ము చూచినంతనే యాలక్ష్మీకాంతుఁడు నానందమంది సకలసంపదలను ఒసఁగివంపును.

కుచే:—ప్రేయసీ! నిజమా! ఆతఁడు నాతోఁ జిన్ననాటిచెలిమి పాటించి మాటాడునా? నన్ను గౌరవించి యాదరించునా? అట్లయిన గొప్పవారిని దర్శింపనేగునపుడు రిక్తహస్తములతోఁ బోరాదని పెద్దలు చెప్పుచుందురుగదా!

గీ. నీవు చెప్పినయట్లు రాజీవనేత్రు
పాదపద్మంబు లాశ్రయింపంగఁజనుట
పరమశోభన మాచక్రపాణికిపుడు
గానుకేమైన గొంపోవ గలదె మనకు?

కాని ప్రాణేశ్వరా! నిజము చెప్పుచున్నాను. విధిలలాటమున నెట్లు లిఖంచినన్లు జరుగవలయుఁగాని యొకరినిబోయి యాచించిన లభించు భాగ్యభోగములు శాశ్వతములగునా?

భామా:—అన్నియువిని యంగీకరించి మఱల నిట్లుపల్కెదరు? మునీంద్రులైనఁ దపముచేసి, మెప్పించియేగదా యాపరమాత్ముని వలయు వరము లడిగికొనిరి. మనము ప్రయత్నము సలుపకయే యేదైన లభించునా? ఆహార ముదరమున నిడకున్న గడుపు నిండునా? గాలిలో దీపికనుంచి 'పరంధామా! నీయనుగ్రహముచే నీదీపిక యాఱిపోకుండునుగాక' యనఁజెల్లునా?

చ. తపమొనరించియేగద వదాన్యతగాంచిరి యోగిపుంగవుల్
యుపగతప్రాణులై మనమహర్నిశముఁ గడు లేమికుంద నా
యపరిమితప్రభావిభవు నత్యధికకృపాప్రపూర్ణుకృష్ణు నా
తపపరిశ్రాంతువేడగ సదాస్థిరభాగ్యము లీయకుండునే?

కుచే:—సరే. అట్లయిన యారమామనోహరుని దర్శింతును గాని యారని కేది కానుకగాఁ గొనిపోవగును?

వామా:—ఆలక్ష్మీకాంతునకీఁదగిన పదార్థమేమున్నది. ఆఁ! జ్ఞప్తికి వచ్చినది. పసినిసుంగులకై దాచియుంచిన యడుకులు దోసె డున్నవి. వానినిఁ గొనిపొండు.

కుచే:—ఆచతుర్దశలోకాధిపతి యీయడుకులను స్వీకరించునా? నిరంతరము షడ్రసోపేతభోజనములఁదినియుచుండు నాజగన్నాథుఁడు యీపృథుకతండులముల స్వీకరించునా?

వామా:—మనోనాథా! మీఱుపేదలీయఁగల కానుకలును, శ్రీమంతులొసఁగు నమూల్యబహూకృతులును నాదేవదేవునకు సమానములే. భాగ్యశాలు లర్పించు కానుకలఁగని సంతసించి, వారి కధికముగ సిరిసంపదలనిచ్చి, పేదలొసఁగు కానుకలకు సంతృప్తుఁడు గాక కొలఁదిగనే వరములిచ్చునా? సభక్తి తాత్పర్యముతో నెవ్వరేది యిచ్చినను, తుదకు ఫలమైనను, పుష్పమైనను, తోయమైనను, పత్రమైనను స్వీకరించి, తృప్తుఁడగును. ఏదో సుధాంశునకు నూలుపోగు సామ్యముగా నీకానుక నొసఁగి రండు.

చ. ఫలమొకఁడిచ్చినన్ దుదకు బత్రమునైన జలమ్మునైన నా
జలజసమానలోచనుడు జాంబవతీ ప్రియనాథుఁడెంతయున్
అలుగక తృప్తినొంది మెదియడ్గిననిచ్చును భాగ్యశాలురన్
కలిమియులేనిబీదలు నొకండెయగున్ దలపోయ శ్రీశుకున్.

నాథా! మీ రాలసింపక త్వరితముగ ద్వారకకేఁగుడు. కొండంత దేవునకు గొండంతపత్రి నీయఁగలరా?

కుచే:—సరే. ప్రేయసీ! పోయెవచ్చెదను. పిల్లలును నీవును జాగరూకులై యుండుడు. ఈనిర్జనకాననాంతరమున నుండుటకంటె రత్నపురమున నేయుండుట శ్రేయస్కరము. మన సోమశర్మగృహమున నుండుట శ్రేయస్కరము. అతఁడు నిన్ను నిజసహోదరివలె నాదరించును.

వామా:—సరే. మీయాజ్ఞానుసారముగనే సోమశర్మయింటికిఁబోయి యుండుము. మీరాకను బ్రతీక్షించుచుందుము.

కుచే:—మిమ్ముఁ్మలను నే దిరిగివచ్చునంతదనుక యఖిలాండకోటిబ్రహ్మాండ నాయకుఁడైన యాపరమేష్ఠియే రక్షించును.

తే. గీ. ఆదిమధ్యాంతరహితుఁడై యలరునట్టి
దేవదేవుండు శ్రీశుండు దివిజలోక
రక్షకుం డండయై మీకు రక్షణంబు
నొసఁగుఁగావుత! కృపనువహించి యతఁడు.

[నిష్క్రమించును.]



ఓం

అవిఘ్నమస్తు.

శ్రీరామాయనమః

# భక్తకుచేల నాటకము.

## పంచమాంకము

### ప్రథమరంగము.

[ద్వారకసమీపమున శ్రీకృష్ణుఁడు]

కుచే:—ఆహా! నేఁడుగదా నాజన్మతరించినది? ద్వారకానగర రామణీయకత నేమనికొనియాడుదును? వియత్పథమునంటు నామనోజ్ఞసౌధములు బారులుతీర్చినట్లుండి హృదయమున కెంతయు సంతసముఁగూర్చుచున్నవి. దేవదేవా! భవదీయదివ్యవదనారవింద సందర్శనోత్సుకమానసుఁడనై ఘూకసూకరహర్యక్షకరాళవ్యాళాదిభయంకరమృగాకులంబైన కాంతారమును, గభీరనదీనదములను, గిరికందరములనుదాటివచ్చితినిగదా! ప్రభూ! అనంతమైన నీలీలల నెన్నిసార్లు తలఁచుకొన్నను తనివితీఱదుగదా! ఆర్త త్రాణపరాయణా! నీమహిమ నాయాదిశేషుఁడైన వర్ణింపఁజాలడు. అట్టియెడ నేనెట్లువర్ణింపఁగలను. మహాత్మా! నీనామము నిరంతరము తలఁచుకొని యానందించు భాగ్యమునకు నోచు

కొనిన నారద తుంబురాది మహాభాగు లేమివున్నము పూర్వ భవంబున సలిపినారోకదా! సముద్రమును బిడికిటబట్టిన యగస్త్య మహర్షి చంద్రుఁడు, తపోవహ్నిచే జగముల కావేదన గల్గించిన విశ్వామిత్ర, వసిష్ట, గౌతమాది మహామునిపుంగవు లెట్టి తపం బొనరించినారోకదా! దేవదేవా! అనంతములైన సమహిమలఁ బొగడుట కే నెంతవాఁడను? ఎంతయో యాయాసమొంది తుదకు, మహోన్నత సుందర సౌధరాజసమన్వితమైన ద్వారకా నగరమును కన్గొంటినిగదా!

గీ. కాంచినాఁడను ద్వారక కనులపండు
వొనర; నెన్నియో యిడుమలనొంది నేఁడు
అంతిపురమున దివ్యసౌధాంతరమునఁ
గలఁడు శ్రీశుండు న స్సదయుఁ గనునొ లేదొ?

[తెలుగులో బృందావనశౌరీ:-అనుబంధము 12]

కుచే:—ఎక్కడినుండి యీాయపూర్వగానము వినిపించుచున్నది? సకల లోక పూజితుఁడగు నారదమునీంద్రుఁడే యైయుండునా?

నార:—(ప్రవేశించి) ఏమి కుచేలా? ఎచ్చటికిఁ బోవుచున్నావు?

కుచే:—నారదమునీంద్రా! నేను ద్వారకకుఁ బోవుచున్నాఁడను. ఆ శ్రీహరి సందర్శనాపేక్షతోఁ బోవుచున్న నాకా నారాయణుని దర్శనభాగ్య మొదవునా?

నార:—కుచేలా! ఆమహామహుని దర్శనార్థ మెందఱో రాజులు వేచియుందురు. ద్వారపాలురు ఆమహీపాలుర రాకనుగూర్చియే శ్రీకృష్ణునకుఁ జెప్పరు. నీవిషయమై వేఱ యడుగవలయునా?

కుచే:—మునీంద్రా! నాయదృష్టమెట్లున్నదో, ఏమికానున్నదో, నిగ్రహానుగ్రహ ధీనుఁడగు నావరాత్పరుని దర్శనభాగ్యము లభించునో,

లేదో! నీవు వాక్రుచ్చిన యట్లు ఒకవేళ నాగోపాలుని దర్శనలాభ మొదవినను, ఆతఁడు నన్ను జ్ఞప్తికిఁ దెచ్చికొని యాదరించునో యాదరింపఁడో. ద్వారపాలకులు కుచేలుఁడనని, దరిద్రుడనని యీసడింతురేమో.

సీ. బాల్యమిత్త్రుఁడనంచు బహుళప్రేమమ్మున
 చూచునో యదయుఁడై చూడఁడొక్కొ-
బ్రాహ్మణుండనటంచు భక్తిగాంచునో లేక
 జీర్ణచేలుండని చేరఁడొక్కొ-
సాందీపగురుచెంత సహపాఠిననియెంచి
 యాదరించునో లేక యవలఁజనునో
తనదుభక్తుఁడనంచు ఘనకృపంజూచునో
 శుష్కదేహుఁడనంచు చూడఁడొక్కొ-
గీ. ఏదియెట్లున్న శ్రమయని యెంచ కేను
యింతదూరమ్మువచ్చితి నహీనభక్తి
ననుచు దయతోడవచ్చి నన్నరయునొక్కొ-
భవ్యమతియైన యామహాభాగుఁ డనఘు.

నార:—(స్వగతము) గోవిందదర్శనోత్సాహియై, మార్గాయాసము నించుకయుఁ బాటింపక దుర్గమములగు పథమ్ములనిగాని, భయంకర మృగసంకులంబులగు వనమ్ములని గాని, యీషణ్మాత్రమైన సంశయింపక యరుగుచున్న యీభక్తాగ్రగణ్యునకుఁ దప్పక యాముకుందుని దర్శనము ప్రాప్తింపఁగలదు. ఇతని నిట్టియెడ నిరుత్సాహపఱచుట కేవల మసమంజసము. (ప్రకాశముగా) కుచేల! నీమనోనిశ్చలత కెంతయు సంతసించితిని. నీ వాజగదారాధ్యుని దర్శనభాగ్యము తప్పకకల్గును. శ్రీకృష్ణ సందర్శన

సౌభాగ్యమునకుఁ దోడు నతులైశ్వర్యభోగప్రాప్తికూడ నిస్సందేహముగ కాఁగలదు. నీకు శుభంబగుఁగాక. పోయిరమ్మా.

కుచే:—చిత్రము.

నార:—(నిష్క్రమించును.)

---

## ద్వితీయరంగము.

---

శ్రీకృష్ణుని యంతఃపుర ప్రాంగణము

(కొంకణ, మాగధ, అంగ, వంగ, కళింగాధిపతులు.)

కొంకణ:—ఓ ద్వారపాలకులారా! ద్వారకాధిపుఁడగు శ్రీకృష్ణపరమాత్మ సందర్శనార్థ మే నిట కేతెంచి మాసము దినములకుఁ బైగా నైనది. ఆయిందిరావల్లభున కీకానుకల నర్పించి, దర్శన మొనరించి, నిజరాజ్యమునకుఁ బోవలయును. నేఁడైన యా మహామహుని దర్శనము చేయింపుఁడు. మీకుఁ దగిన పారితోషిక మొసఁగెదను.

మగధ:—ఓయీ విజయా! జయునికంటె నీవే యొకింత సత్స్వభావుఁడవు వోలెఁ గాన్పించుచున్నావు. నేను వచ్చి వారము దినము లైనది. జరుగురుగా చూచి పరిష్కరించవలసిన రాజకీయము లెవ్వియోగలవని, వేగముగ రమ్మని యమాత్యవరేణ్యుఁడు కబురంపియున్నాఁడు. నేఁడు వైగర్భిమనోనాథుని దర్శనము చేయింపుము.

విజయు:—మహారాజులారా! రుక్మిణీ సత్యభామాదేవేరులం గూడి సరససల్లాపమగ్నుఁడైన మాప్రభువుదర్శనము మీకు నేఁడు లభింపదు. రేపు తప్పక చేయింతును.

అంగ:—జయుఁడా! పక్షమునకుఁ బూర్వ మొక పర్యాయమువచ్చి ద్వారకాపురీశుని దర్శనభాగ్యము ప్రాప్తించనందున వెడలి

పోయి మఱల నేఁడువచ్చిన నాకైన దర్శనభాగ్యము కలిగింపుము.

కళింగ:—నాకో—

జయు:—మీరింకను నాల్గుదినములు వేచియుందురేని తప్పక సఫలీకృత మనోరథులై చనఁగలరు. ఈలోగా మమ్మెంతగాఁ దొందర చేసినను ఫలము కలుగఁబోదు.

[కుచేలుఁడు ప్రవేశించును.]

కుచే:—అయ్యలారా! మీ రూపురేఖాదులఁబట్టి చూడగా శ్రీరమాకాంతుని యంతఃపుర ద్వారపాలకులని స్ఫురించుచున్నయది.

గీ. పూర్వ భవపుణ్యఫలముచే పొలుపుమీఱ
నాదినారాయణునకు మీ రహరహమ్ము
ద్వారపాలకులై యుండు పదవిగలిగె
నహహ! మీ భాగ్యమే భాగ్యమనగనగును.

జయు:—(నవ్వి) ఓహో! నీకుఁగూడ శ్రీకృష్ణులవారి దర్శనము కావలయునా? నెలల తరబడిగనుండిన యీమహీపాలురకే, యప్పరమాత్ముని దర్శనభాగ్యము కలుగలేదే. వీరందఱు నెవ్వరో యెఱుఁగుదురా?

గీ. మగధ కొంకణ ప్రభువులీ మహితయశులు
అంగ వంగ కళింగ నృపాలురీరు
ఇట్టివీరికె శ్రీకృష్ణు, డింతవఱకు
కానరాలేదు నీకెట్లు కానుపించు?

విజయు:—ఆర్యోత్తమ! నీవు ద్విజోత్తముఁడవగుట ప్రణామము నల్పుచున్నాడ. నీదేయూరు—

కుచే:—అవంతిదేశస్థంబైన రత్నపురము. శ్రీకృష్ణుఁడును నేనును బాల్యసఖులము. చిన్ననాట నొకగురువునొద్ద విద్యాభ్యాసమొనరించియున్నారము.

జయు:—తమనామధేయము—

కుచే:—నన్ను కుచేలుఁ డందురు.

జయు:—కుచేలుఁడా? అహ్హాహ్హా! పేరునకుదగినట్లేయున్నదయ్యా నీవేషము. చిన్ననాటిమిత్రుడట. మాగోపాలస్వామి కెట్టిగొప్పస్నేహితుఁడు నేటికి వెలసెను? కుచేలుఁడా! కుచేలుఁడ!

విజయు:—ఓబక్క-బాపనయ్యా! శ్రీకృష్ణమూర్తి దర్శనాకాంక్షివై వచ్చునపు డింతధవళవస్త్రమైన ధరించివచ్చుట యుక్తముకాదా?

కుచే:—ఉన్నచో ధవళవస్త్రమేకాదు; పీతాంబరమైన ధరించవచ్చును. లేనియెడల చింకిపాతయేగతిగదా!

జయు:—మహారాజులకే యదుభూషణుని దర్శనముకలుగలేదు. నిన్ను చూచినచో నాప్రభువు మమ్ము నిందించును. బడుగుబాపడా! పొమ్ము. పొమ్ము. వృథాయాసమేలా?

కుచే:—ఓద్వారపాలకా! నీవుపొమ్మంతనే పోవుటకేనా నేనెచ్చటనో యున్న రత్నపురమునుండి నడిచివచ్చినది. ఎవరిభాగ్యమెట్లున్న నట్లగును. మహారాజులరాకనుగూర్చి చెప్పినయట్లే నారాకను గూర్చికూడ యాశ్రీహరికెఱిగింపుము. నాయెడదయయుంచుము నాయనా! ఆయిందిరావల్లభుని దర్శనమీయ నిరాకరించినచో దప్పక వెడలిపోవుదును.

విజయు:—నీ కామహామహుని దర్శనమెట్లును గలుగదు. మమ్ము విశేషముగా బాధింపక పొమ్ము.

కుచే:—అయ్యలారా! కృపవహించుడని వేఁడితిని. ఘనదారిద్ర్యాంధకారమగ్నుఁడనై యున్న నాకు ధరించుటకు వస్త్రముతేలేవు. చతుర్దశభువనములను గుక్షి నిడుకొన్న యామాధవునకు నేనే కాదు. సర్వము జ్ఞప్తియందుండును. (మహారాజులఁగాంచి)

మహాత్ములార! నాయెడ మీరైన కనికరముఁ గల్గి, వారలతోఁ జెప్పుఁడు.

జయు:—ఏమి యీయాగడము?

కొంకణ:—జయ విజయులారా! బ్రాహ్మణు లగ్రవర్ణజులు. సర్వసంపూజార్హ చరిత్రులు. అట్టి భూసురోత్తములను మేము దేవతలనుగా భావించి పూజింతుము. యాదవకులాలంకారుఁడగు గోవిందుఁడు కూడ ద్విజన్ముల గౌరవించును. ద్విజోత్తములే తన యిలవేల్పులని యాదరించును.

గీ. తివిరియజ్ఞాన తిమిరప్రదీపమగుచు
నవ్యయంబైన బ్రహ్మంబు ననుభవించు
భరితసత్త్వుండు సత్కర్మనిరతుఁ డఖిల
భూసురశ్రేష్ఠుఁ డనఘుండు బుధనుతుండు.

కళింగ:—జయవిజయులారా? కొంకణాధీశ్వరుండు పల్కినది సత్యము. లోకకల్యాణమూర్తియుఁ బతితపావనుఁడును నగు హరి యంతఃపుర ద్వారపాలకులై యుండియుఁ బూజ్యులైన భూసురోత్తములఁ దిరస్కరించుట మిక్కిలి చిత్రము. బ్రాహ్మణుల వచనము లమోఘములు. వారిశాపము లప్రతిహతములు. అతని రాకను గూర్చి తెలుపుటయే యుక్తము.

మగధ:—నిష్కపటముగా నట్లుచేయుట యుక్తము.

జయు:—విజయా! ఈనృపాలురు చెప్పినచొప్పునఁ జేయుట శ్రేయస్కరము. పోయి యీతనిరాకనుగూర్చి రుక్మిణీ వల్లభునకు దెలియఁజేసిరమ్ము.

విజయు:—బ్రాహ్మణోత్తమా! అజ్ఞులమై మేమాడినపలుకులకు కినుక వహింపక క్షమింపుము. నీరాకనిపుడే ప్రభునకెఱిఁగించి వత్తును.

(పోవును)

(విజయుఁడు తిరిగివచ్చును.)

కుచే:—[ఆశ్రమముతోఁజూచును.]

విజ:—(నమస్కరించి) ద్విజోత్తమా! చాలచక్కనిచిత్రము జరిగినది.

కౌంశ:—ఏమిజరిగినది.

విజ:—నేనేగి సత్యభామా రుక్మిణీదేవులతోఁగూడి సరససల్లాపనిమగ్నుఁడై యున్నతఱి దరికేగి నిలువఁబడియుంటిని. అపుడు సత్యాదేవి "ఓరీ! నాథుఁడు నేఁ డెవరికిని దర్శనమీయఁబోఁడని చెప్పియుంటినిగదా. మఱల నీవు డెందులకు వచ్చినావు?" వని గద్దించి యడుగ, నే "నమ్మా! యొకపాఱుడువచ్చి గోవిందుని దర్శనము కానిదే వెడలనని చెప్పుచుండుటచే నావిషయము విన్నవింపవచ్చినా"ననంటిని. అంత విదర్భ రాజకుమారి అంతపట్టుబట్టిన యాభూసురోత్తముని నామధేయ మెఱింగిరాలేకపోయితివా?" యని ప్రశ్నింప, నే 'నమ్మా! ఆపాఱుని యభిధేయము కుచేలుఁ టడ' యంటిని. ఆమాటవినినంతనే గోపాలుఁ డొక్కయదటున శయనించియున్నవాఁడు కూర్చుండి "ఏమీ? కుచేలుఁడా! నాబాల్యసఖుఁడు కుచేలుఁడా! వెంటనే గొనిరమ్ము. పొమ్ము. పొమ్ము" అని తొందరచేసె. స్వామీ! నీవిపుడు కుచేలుఁడవైనను స్వామి సందర్శనమున సుచేలుఁడవుగావచ్చును. మా యపచారము సైరింపుము.

కుచే:—ధన్యుడనైతిని. విజయా! జగత్కల్యాణమూర్తి దర్శనము మీకు నిరంతరముకల్గుచుండును. అట్టిభాగ్యమునకు నోచుకొన్నందులకు మీ రెన్నివేలయేండ్లు ఘోరతపము సలిపి యున్నారోగదా!

విజ:—స్వామీ! మాధవుఁడున్న యాగారము చేరుటకు మనము డెబ్బదిరెండుకక్ష్యాంతరములు గడువవలయును చూడుడు. శ్రీకృష్ణ భగవానుని బాల్యలీలావిశేషముల నన్నిటిని వర్ణించుచిత్రములివి,

మిత్రమా! అన్నియవస్థలలోను బాల్యావస్థయే సుఖప్రదమై, యానందదాయకమయి యొప్పునుగదా! ఆదినములఁ దలఁచు కొన్నచో నొడలానందాతిరేకమునఁ బులకలెత్తుచున్నది. అప్పటి మనయాటపాటలు స్వప్నమువలె —సుఖమయస్వప్నమువలె- దోఁచుగదా!

కుచే:—ఆహా ! మాబాలకృష్ణుని కాళీయమర్ధనచిత్రమిది. ఏమా తేజ స్ఫురితలోచనము. (ముందునకు నడచి) ఈచిత్రము కంసనంహార మును సూచించుచున్నది. ఈపటమున శకటాసురవధ చిత్రింప బడినది. రక్కసియగు పూతనను దెగటార్చినవృత్తాంతము నీ చిత్రకారుఁ డెంత మనోజ్ఞముగ లిఖంచినాఁడు. అన్నిటికంటె యమునానదినుండి జలపూరితములగు ఘటముల గొనివచ్చు గోపికల నిరోధించి సరసాలాపములాడువృత్తాంతము చాలచక్కగ రచింపబడినది.

విజ:—ఇప్పటికి డెబ్బదికళ్యాంతరములు గడచినారము. ఇక రెండువార ములు గడచినంతనే యారమామనోహరుడు కాన్పించును.

శ్రీకృ:—(చూచి) ఓహో! కుచేలా! ఎన్నాళ్ళకుఁ గనబడితివి. (వచ్చి కౌగిలించుకొనును.)

కుచే:—యదువంశాలంకార! నీదర్శనము నామార్గాయాసము నంత రింపఁజేసినది. నాహృదయము నానందభంగమాలికలఁ దేలించి నది. ఆనందమయమరీచికల సోలించినది.

సత్యభామ:—(పీతాంబరములఁ దెచ్చి యిచ్చును.)

రుక్మిణి:—(పంచభక్ష్యపరమాన్న సహితమైన పళ్ళెరము ముందిడును.)

శ్రీకృ:—ప్రియసఖా! ప్రయాణంపు బడలికచే గాటమగు శ్రమము నొందిన ట్లున్నది. ముందుగా వన్నీట జలకమాడి రమ్ము.

జాంబ:—ద్విజోత్తమా! ఇదే స్నానశాల! రండు.

కుచే:—(సుస్నాతుఁడై, పీతాంబరముల ధరించి, భోజనముచేయును.)

రుక్మి:—(చామరములతో వీచును.)

శ్రీకృ:—కుచేల! ఇన్నాళ్ళకా నన్ను చూడవలెననుకోరిక నీకుఁగలిగినది?

కుచే:—నానుదుట నిన్ను చూచెడి భాగ్యమింతవఱకు గలుగునట్లు లిఖింపఁబడియుండలేదు. అట్టి భాగ్యము నాకు నేఁడు కలుగుటకు నాపూర్వజన్మార్జితపుణ్యఫలమే కారణమైయుండునోవు. లేకున్న, యెన్నోదినములనుండి నిన్ను కాంచు కుతూహలముండియుండియు నేఁటి దనుక నేల నాకాబుద్ధి జనింపకయుండును. పెద్దలు బుద్ధిః కర్మానుసారిణీ యని వచించుట వినమే.

తే.గీ. ఇంతకాలమ్మునసుఁగాని యేను నిన్ను
కాంచు కోరికయెదలోన గల్గదయ్యె
కర్మ పరిపక్వమయ్యె శ్రీకాంతనేఁడు
కలిగె దర్శనభాగ్యమా కాంక్షతీఱ.

శ్రీకృ:—ప్రియసఖియులారా! ఈతఁడు నాబాల్యస్నేహితుఁడు. ఇరువురమును సాందీపుఁడను గురూత్తమునికడ చదువుకొనినారము; మిత్రమా! నీకెంతమంది పిల్లలు?

కుచే:—ఇరువదియేడ్గురు.

శ్రీకృ—నీవదనమైఖరినిబట్టిచూడ నాకదొకవిధముగాఁదోఁచుచున్నది.

సీ. బ్రాహ్మణోత్తమ వేదపఠనలబ్ధ
శ్రుతఁగల చారువంశంబువలనఁ
బరిణయంబైనట్టి భార్య వామాక్షి వ
ర్తనములఁ దగ భవత్సదృశయగునె
తలఁప గృహక్షేత్ర ధనదారపుత్రాదు
లందు నీచిత్తంబు చెందకుంట
తోఁచుచున్నది యేను తుదిలోకసంగ్రహా
ర్థంబు కర్మాచరణంబుసేయు

గీ. గతిఁ మనంబునఁ గామమోహితులుగాక
నర్థిమై యుక్తకర్మంబు లాచరించి

ప్రకృతి సంబంధమును బాసి భవ్యనిష్ఠఁ
దవిలియుందురు కొందఱుత్తములు భువిని.

గీ. ఆప్రశాంతమనోజ్ఞ వనాంతరమున
నాఁడు మనమెన్నియాటలనాడినాము
ఆశరద్రాత్రి వెన్నెల నద్భుతముగ
మురళిమ్రోయింపవే జగన్మోహనముగ.

కుచే:—ఆనాఁడు గురుపత్ని వంటకుపయుక్తములగు కట్టెలనేఱికొని రమ్మని యరణ్యమున కంపినది మఱచితివా సఖా!

శ్రీకృ:—ఆసంఘటనము నీజీవితమున నెన్నఁడును మఱవను. ఆభయంకరసమయ మిప్పటికి నాకన్నులకుఁగట్టిన ట్లున్నది.

సీ. ఘుమఘుమారావసంకుల ఘోరజీమూత
పటలసంఛన్నాభ్రభాగమగుచుఁ
జటులఝంఝూనిలోత్కట సముద్ధూత నా
నావిధ జంతుసంతానమగుచు
చండదిగ్వేదండతుండనిభాఖండ
వారిధారాపూర్ణ వసుధమగుచు
విద్యోతమానోగ్రఖద్యోతకిరణ జి
ద్విద్యుద్ద్యుతిచ్ఛటా విభవమగుచు

గీ. నడరి జడిగురియు నినుండు నస్తమింప
భూరి నీరంధ్రనిబిడాంధకారమేచి
సూచికాభేద్యమై వస్తుగోచరంబు
గాని యట్లుండ మనము నవ్వానదడిసి.

గీ. బయలు గొందియుఁ జెను మిట్టపల్లములును
రహిత సహితస్థలంబు లేర్పరుపరాక
యున్న యత్తరి మన మొకరొకరిచేతు
లూతగాగొని నడచుచునుందునంత.

కుచే:—అవునా దృశ్యమంతయు నిప్పటికి నామనోనేత్రసముఖమున నున్నది. మనమట్లా నిశీథిని నావర్షమ్ముననఁ చలిలో నొకవృక్షచ్ఛాయను విశ్రమించి యుదయమున లేచుసరికి మనకొఱకు వెదకికొనుచు గురూత్తముఁడగు సాందీపుడు మనల గలిసికొని యేమనెనో నాకుజ్ఞాపకము లేకపోలేదు. అమ్మహనీయుడు—

చ. కటకటయిట్లు మాకొఱకుగాఁ జనుదెంచి మహాటవిఁ గా నము
త్కట పరిపీడనొందితిరిగావున శిష్యులు మాఋణంబు నీ
గుటకిది కారణంబు సమకూరెడిచో యిటమీఁదమీకు వి
స్ఫులధనబంధుదార బహుపుత్త్రవిభూతిజయాయురున్నతుల్.

ఇట్లనియమ్మహాభాగుఁడు మనల నింటికిగొంపోయి యాదరానురాగవచనంబుల మనచిత్తంబుల కత్యంతానందము ఘటించెగదా! శారదశర్వరీసమయముల మనము యమునాసైకతస్థలుల నాటలాడుచుండ నీవుజగన్మోహనకరముగ వేణుగానమొనరింపలేదా? అమ్మా! విదర్భరాజనందనీ? కుసుమకోమలములగు నీకరములు కందిపోయియుండును. నాయందు కృపయుంచి యింకనైన విసరుట మానుమమ్మా! అమ్మా! సత్యభామాదేవీ! పతియెడగల యనురాగాతిశయముచే నాకుఁ బరిచర్య సల్పిన సుకుమారివి. మీరిఁక పరిచర్యలఁ జేయవలదు. కృష్ణా! నిజముగా నే నదృష్టవంతుఁడను. పరమతపోధనులగు యోగీంద్రులకే దుర్లభదర్శనుండవు. గర్భదరిద్రుఁడనని యేనగించుకొనక బాల్యస్నేహము మఱచిపోక నన్నాదరించిన నీయౌదార్యము నేమని పొగడుదును? ఓజగన్నాటక సూత్రధారీ! నీవు శ్రీమన్నారాయణుఁడవు. వివిధావతారములను దాల్చి, దుష్టశిక్షణము, శిష్టరక్షణము సేయుచున్నాఁడవే గాని యన్యము కాదు. సృష్టిస్థితిలయముల కీవే హేతుభూతుఁడవు. ఆదిమధ్యాంత రహితుఁడవు. నీ లీలావిశేషమే ప్రకృతి. పృథివ్యప్తేజోవాయు రాకాశములు నాఁబడు పంచభూతములును నీవే. వివిధాభిధేయము

లతో విలసిల్లుచు ప్రజలచే సంస్తుతింపఁ బడుచున్న పరమేష్ఠివి నీవే. సర్వము నీవే. సర్వమునందును నీవే యున్నావు. జీవులకు వారి కర్మానుసారముగ నైశ్వర్య దారిద్ర్యములను సుఖదుఃఖములను కల్పించునది నీవే. ఓజగదాధారా! నిన్ను నమ్మిన వాఁడను నాకు మోక్షమునిమ్ము అంతియే. (నమస్కరించును.)

అనుబంధము 13

శ్రీకృ:—సతీమణులారా! ఈతని భక్త్యతిశయమును గాంచినారా? కుచేలా! నీవు చెప్పినది నిజము.

క. భూసురులకెల్ల ముఖ్యుఁడ
నై సకలకులాశ్రమంబులందును నెపుడున్
ధీ సుజ్ఞానప్రదుఁడన
దేశికుఁడన నొప్పుచుందు ధృతినెల్లెడలన్.

గీ. అట్టి వర్ణాశ్రమంబులయందు నర్థ
కుశలులగువారు నిఖిలైకగురుఁడనైన
నాదు వాక్యంబుచే భవార్ణవము పెలుచ
దాటుదురు మత్పదాంబుజధ్యానపరత.

రుక్మిణి:—ఆహా! జగన్నాథునిచే వివిధోపచారములనందజాలిన యీ బ్రాహ్మణోత్తముని యదృష్టమును యేమని కొనియాడవచ్చును? భాగ్యమన నీతనిదే భాగ్యము!

ఉ. ఏమితపంబుచేసెనొకో యీధరణీదివిజోత్తముండు తొ
ల్బామున, యోగివిస్ఫురదుపాసనుఁడై తనరారు నీజగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమున న్వసియించియున్నవాఁ
డీమహనీయమూర్తి కినయే మునిపుంగవు లెంతవారలున్.

సత్య:—నిజము. దేవేంద్రాదులకుఁ గాని, యంబుపర్ణభక్షులై సాంద్ర విపినాంతరముల కఠోర తపోవ్రతనిష్ఠ మునీంద్రులకుఁగాని లభింపని యవకాశ మీధరణీసురోత్తమునకు లభించినది. మలినాంబరధారియయ్యు, కుపాకాంగుఁడయ్యు నీతఁడు మనోహరునిచే

లెక్కలేనన్ని సపర్యల నందుచున్నాఁడు. భక్తియే ప్రేమకంటె యుత్కృష్టమైన దగునా?

[తెఱలో భజగోవిందం భజగోవిందం.]

నార:—(పాడుచుఁ బ్రవేశించును.)

శ్రీకృ—నారదమునీంద్రా! రమ్ము. అయ్యాసనమధిష్టింపుము.

కుచే:—నారదఋషీశ్వరా! మత్ప్రణామములఁ గైకొనుము.

నార:—(చూచి) ఓహో! ఏమి యీయపూర్వసమావేశము. నా కన్నులు సఫలములైనవి. భక్తశిఖామణి కుచేలుఁ డేమహామహు నహ్నరిశములు సంస్మరించుచుండెనో, యారమాకాంతుఁడు—అనిరవధికానందమూర్తి—ఆముకుందునిచే నాదరింపఁబడి సపర్యలనందుచున్నాఁడు. భక్తియే ప్రణయముకంటె మహోత్కృష్టమైనదని నిరూపించుటకుఁ గుచేలుఁడే నిదర్శనము.

సత్య:—(తలవంచుకొనును.)

కాళి:—నారదసంయమీంద్రా! ఏమి జరిగినదో నేను చెప్పెద నాలకింపుము.

చ. తన మృదుతల్పమందు వనితామణియైన రమాలలామపొం
దును నెడగాఁ దలంపక యదుప్రవరుం డెదురేగి మోదము
ద్దనుకఁగఁ గౌగిలించి యుచితక్రియలం బరితుష్టిఁ జేయుచు
న్వినయమునన్భజించె ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుఁడే.

నార:—నాహృదయము నితాంత సంతోష తరంగితమైనది.

శ్రీకృ:—కుచేలా! బాల్యస్నేహితుఁడనగు నన్ను చూచుటకు వచ్చినాఁడవుగదా! నేను తినుట కేమి తీసికొనివచ్చితివి?

కుచే:—(సిగ్గుపడి) మాధవా! మహారాజులు గోమేధిక, పుష్యరాగ, వజ్రవైఢూర్యాదిదివ్యమణిఖచితంబులైనయాభరణంబుల కానుక లిచ్చుచుండగలరు గాని నిఱుపేదనగు నేనేమి యీయఁగలను?

శ్రీకృ—ఊరక యట్లనెదవుగాని నాకేమియుఁ దెచ్చిపెట్టుకుండ నుందువా? ఏదీ! నీయుత్తరీయమును జూడనిమ్ము. (ఉత్తరీయము

కొంగుననున్న యడుకులను గైకొని) ఓహో! అడుకులను దెచ్చితివా? నా కివియున్నఁ జాల నిష్టముసుమా. (గుప్పెడు తినును, మఱొక గుప్పెడు తినఁబోవ)

రుక్మిణి:—(వారించి) నాథా! ఆగుఁడు.

క. సొంపారఁగ నితనికి బహు
సంపదలందింప నివియ చాలున నీఁక భ
క్తింపఁగ వలువదు త్రిజగ
త్సంపర్క దేవదేవ సర్వాత్మహరీ.

రెండవగుప్పె డడుకులను మూకిందు.

సత్య:—అక్కా! అడుకులకు మొగమువాచినట్లు నాథుఁ డన్నియుఁ దినుచుండ వలదని వారింతువేల?

నార:—అమ్మా! చక్కగా సెలవిచ్చితివి. అడుకులకు మొగమువాచి యిప్పుడు తినుచున్నాఁడు. సరే; బాల్యమున పాల్మీగడలకు మొగమువాచి వాని నపహరించినాడు.

రుక్మిణి:—చెల్లెలా! అదికాదు. గుప్పె డడుకులు తినుటవలన సకల సంపదలు నిచ్చినట్లయినది. రెండవగుప్పెడు కూడ తినినచో నీఁక నేమి యీయఁగలఁడు?

సత్య:—ఇఁ కేమియు నిచ్చుటకుండదా?

రుక్మిణి:—ఉండదు. దేవేంద్రుని భోగభాగ్యములతోఁ దులతూఁపఁగల యైశ్వర్యమున కతఁ డీవటుకే కర్తయైనాడు. మిగిలిన గుప్పెడు తిన్నచోఁ దానే యీభక్తునకూడిగము సలుపవలసియుండును.

శ్రీకృ:—వైదర్భీ! అట్లయిన మిగిలిన యీయడుకులను నీవును, సత్యయుఁ దినుఁడు.

నార:—అమ్మా! సాత్రాజితీ! ఇప్పుడైన భక్తియే యుత్కృష్టమైనదని యొప్పుకొందువా?

సత్య:—అంగీకరింతుము. నారదా! నిన్ననవలసినది లేదు. నాథుఁడు సూత్రధారియై నాకు గర్వభంగము చేయుట కాడించిన యీ నాటకమున నీవు ప్రధాన నటుఁడవు.

శ్రీకృ:—ప్రేయసులారా! కుచేలున కెట్టి లోపమును కలుగనీయకుఁడు. కుచేలా! నారదమునీంద్రా! నే జెప్పినది వినుడు. మహారాజులు తెచ్చియిచ్చునట్టి యమూల్యాభరణాదులు నన్ను సంతృప్తచిత్తునిగఁ జేయఁజాలవు. భక్తియుక్తులై దళము గాని, తుదకు జల బిందువు గాని తృణమైననుగాని యిచ్చినచో సంతుష్టి నొందుదును.

క. దళమైన బుష్పమైనను
ఫలమైన సలిలమైనఁ బాయని భక్తిన్
గొలిచి జనులర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్.

కుచేలా! ఎన్నాళ్లకో వచ్చితివి. అట్లుగాక యికముందైనఁ దఱచుగా వచ్చుచుండుము.

కుచే:—మిత్రమా! రేపటి యుదయముననే నేను రత్నపురమునకుఁ బోవుట కనుజ్ఞనిమ్ము. నాకొఱకై భార్యాపుత్రులు డోలాందోళిత చిత్తులై యుందురు.

శ్రీకృ:—అట్లే కానిమ్ము. సఖియలారా! కుచేలునికి షడ్రసోపేతముగ భోజనమిడుఁడు.

నార:—కుచేలా! నీవు భాగ్యశాలివి. నీయదృష్టమెన్నుటకు నాకేగా దానలువకైనఁ దరముకాదు.

గీ. యుగయుగమ్ములనుండి మహోగ్రతపము
సల్పిన మునీంద్రులకుఁగూడ సాధ్యపడని

దేవదేవుండు ప్రేమమై ద్విజవరేణ్య
నిన్ను కృపగనె నీభాగ్య మెన్నఁదరమె?
మీకెల్లరకును శుభంబగునుగాక, నేఁబోయి వచ్చెదను.

(అనుబంధము పాడుకొనుచు నిష్క్రమించును.)

---

## తృతీయరంగము.

---

[రత్నపురప్రాంతమున కుచేలుఁడు ప్రవేశించును.]

కుచే:—(స్వగతము) నేనెంతో పుణ్యము పూర్వభవంబునఁ జేయుటం జేసియే యాశ్రీకాంతుని దర్శనము సులభముగ నైనది. ఆ యదువంశపయః పారావారరాకాసుధాకరుఁడు నేఁదలఁచినంత కంటె మిన్నగ నాదరించినాఁడు. పంచభక్ష్యపరమాన్నసహితమైన భోజనమిడినాఁడు. ధరింపఁ బీతాంబరము లిచ్చినాఁడు. ప్రేమతోఁగొంపోయిన యడుకుల నాప్యాయనముగ నారగించినాఁడు. తనసతీమణులచే సకలోపచారములఁ జేయించినాఁడు. నాపుణ్యముగాకపోయినచోఁ ద్రిలోకవంద్యుఁడగు నాయనతారపురుషుఁడేడ? పూటకుంగతిగానని దరిద్రుఁడ నేనేడ? ఇరువురకు నెంత యంతరమున్నది?

సీ. పరికింప గృపణస్వభావుండనయినట్టి
యేనేడ నిఖిలావనీశుఁడైన
యిందిరాదేవికి నెనయుంగ నిత్య ని
వాసుఁడై యొప్పునవ్వాసుదేవు
డేడ నన్నర్థిమై దోఁడబుట్టినవాని
కైవడిఁ గౌగిటఁగదియఁజేర్చి

దైవంబుగా నన్ను భావించి నిజతల్ప
ముననుంచి సత్క్రియల్పూనినడిపి
గీ. చారునిజ వధూకరసరోజాతకలిత
చామరానిల విగతవిశ్రమునిజేసి
శ్రీకుచాలిప్త చందనాంచిత కరాబ్జ
తలములను నడ్గులొత్తె వత్సలత మెఱసి.

గాని, యేలనోకాని యేమియు నొసఁగకయే సాగనంపె. ఇల్లు సేరిన పిదప నాముకుందుఁ డేమియొసఁగెనని వామాక్షియుఁ బిల్లలును యడిగినచో నేమని చెప్పవాఁడ? దీనికింగారణ మొకటిమైయుండును.

ఉ. శ్రీనిధి యిట్లు నన్ను బచరించి ఘనంబుగ విత్తమేమియు
న్నీని తెఱంగు గానఁబడి నెన్న దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్ను జేరఁడని కాక శ్రితార్తిహారుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరిపూర్ణునిగా ననుజేయకుండునే?

అదియుఁగాక, నాయిలవేల్పు నన్నాదరించి, కుశలమరసి, గౌరవించి, 'నీవు భార్యాపుత్రులలోఁ గుశలమా' యన్నపుడు నేనేల నీదారిద్ర్యము విషయమై చెప్పనైతిని? చెప్పినచో నాకరుణానిధి నాకు వలసినది యిచ్చి పంపఁడా? ఇదియేమి? నే నివసించు రత్నపుర మిదియేనా? లేక దారితప్పి మఱేపురమునైన ప్రవేశించితినా? ఈమేడ యెవరిది? నేను పోవునపుడు సోమశర్మ యింటియం దుండమని చెప్పితినిగదా! లేక ప్రాతయింటికే పోయి యుందురా? ఈ మహోన్నత సుందరసౌధ మిదివఱకు రత్నపురములో నేనెన్నఁడును జూచియుండలేదే? ఇదియెవ్వరిదై యుండనోపును? ఇట్టి దివ్యహర్మ్యమున నల్పకాలమున నిర్మింపఁగలిగిన మహానుభావుఁడు, భాగ్యశాలి యెవరోగదా!

పరిచారకుఁడు:—(యీవలకు వచ్చును.)

కుచే:—ఈహర్మ్యమెవ్వరిది?

పరి:—ద్విజోత్తమా! ఎవరిదైననేమి? బ్రాహ్మణు లెవరువచ్చినను గౌరవించి, పూజించి, యాతిథ్యమొసఁగుటకు మాదేవిగారు యాజ్ఞాపించియున్నారు. లోనికిరండు.

కుచే:—ఇంటియజమానిచేనాహ్వానింపబడకుండ నేనులోపలకెట్లువత్తును?

పరి:—అట్టి యభ్యంతరములేదు. ఎవ్వరైనను రావచ్చును. అదిగాక మాయజమాని యింటలేరు. గ్రామాంతరమున కరిగియున్నారు.

రంగ:—(యీవలకువచ్చి చూచును.)

కుచే:—ఇదియేమి? ఈబాలుడెవరో మారంగనివలె నున్నాఁడు.

మాధ:—(యీవలకు వచ్చును.)

కుచే:—అదేమి? మా మాధవుఁడు కాఁడా?

మాధ:—నాన్నగారూ!

రంగ:—నాన్నగారూ!

కుచే:—ఇదియేమి? మీరిచ్చట నెందుల కున్నారు?

రంగ:—(లోనికిఁ బరుగెత్తును.)

కుచే:—(లోనఁ బ్రవేశించును. ముత్తైదువులు హారతులిత్తురు.) ఏమిది? నాశరీర సౌష్టవము మాఱుచున్నది. నామేనికిఁ గ్రొత్తచ్ఛాయ యేదోవచ్చినది. నీరసముగ నుండెడి నేను సింహబలాఢ్యుడనైనాను. కంఠసీమనున్న తులసీ పూసలపేరు రత్నహారమైనది. వ్రేలిని ద్రుప్పుపట్టియున్న యిత్తడియుంగరము రత్నాంగుళీయమైనది. (వామాక్షి వచ్చి నమస్కరించును.)

కుచే:—దేవీ! మీయందఱకును గుశలమేకద! ఈదివ్యభవనమెవ్వరిది? మనబాలురు పీతాంబరములధరించి రత్నాభరణభూషితులై ధగద్ధగాయమానముగ నేలప్రకాశించుచున్నారు?

**వామా:**—నాథా! సావధానచిత్తులరై వినుఁడు. మీరరిగినపిదప నొక నాటిరాత్రి పిల్లలు పాల్మీగడలు కావలెనని యొకడును, రత్నాభరణములు వలయునని మఱొక్కడును, ధరించుట కమూల్యపీతాంబరములు కావలెనని యింకొకడును, నివసించుటకు మహోన్నతరమణీయహర్మ్యమున్న దో బాగుండునని మఱొకడును యడుగ "నాయనలారా! మీకన్నియు నాగోపాలకృష్ణుడిచ్చు" ననిపల్కి నిద్రబుచ్చితిని. ఆరాత్రి నాకెన్నో సుఖస్వప్నములు కలిగినవి. తెల్లవారి లేచి చూచుసరికి మేము నివసించిన మనప్రాతయిల్లు యీసౌధముగ మారినది. బాలురు ధరించి యున్న చింకిగుడ్డలు పీతాంబరములైనవి. నేదాల్చియుండిన మలినాంబరము పట్టుచీరయైనది. కంఠసీమ నెన్నోరత్నాభరణము లున్నవి. కోశాగారమునిండ లెక్కింపనలవిగాని ధనమున్నది. దొడ్డిలో గోగణము—యింటిలో దాసదాసీజనము, ధాన్యపు గాదులందు ధాన్యము—ఒక్కటేమి? సకలసంపత్సౌభాగ్యము లును—నాహృదయమును నిరతిశయానందభరితము గావించినవి గాని, నాథా! మీవియోగ మాపంచభక్ష్యపరమాన్నయుతము లైన భోజనములను నాకు సంతృప్తి నిడలేదు.

**కుచే:**—ఆహా! ఆదేవదేవుని యవ్యాజకృపావిశేషమున నన్నాతఁడెంతో గౌరవించెను. భార్యలగు సత్యభామా రుక్మిణ్యాదులచేఁ బరిచర్యలఁ జేయించెను. ఆరమాకాంతుని సౌధమునకును, యీహర్మ్యమునకును నిసుమంతైన భేదములేదు. ఏమి యీస్ఫటికశిలామయములైన కుడ్యములు—నేత్రానందకరములైన చిత్తరువులు? హే! మురారీ!

సీ. సూర్య చంద్రప్రభాశోభావిభాసిత
చంద్రకాంతస్నిగ్ధ సౌధమిద్ధి
రమణీయచిత్రముల్ రహిమించుకుడ్యముల్
పరమాద్భుతంబయి వరలుచుండ
నవసారభాంచిత పవమానవీచికల్
డెందమానందమ్ము నొందఁజేయ
అప్సరకాంతల నపహాసింపఁగఁ జాలు
పరిచారకలతోడ పరిఢవిల్లు
గీ. గరిమ సంగీతవాద్యముల్ కదుముదమ్ము
గొలువ దేవేంద్రువైభవ శ్రీఁబెడలఁపఁ
జేయు నీ దివ్యహర్మ్య మజేయుఁడైన
యమరవిభునిదొ, యెవరిదో యరయనగును.

వామా:—మంజరీ! ద్వారముకడ నెవరు?

మంజ:—అమ్మా! బిచ్చగాండ్రు. వారికిఁ బుష్కలముగ బియ్యమునిడితిని.

వామా:—ఏమే కనకలతా! ఆర్యపురుషునకుఁ బన్నీటిస్నానము నాయత్తపఱచితివా?

కన:—చిత్తము. అయ్యగారు రావచ్చును.

వామా:—ఏమే సుహృల్లతా! బ్రాహ్మణసమారాధనకు వలయు సంభారములను మహానసాధికారి కొసఁగితివా?

సుహృ:—ఇచ్చితినమ్మా.

వామా:—నాధా! మీ మార్గాయాసము బోయుటకై పాదములొత్తుదాన. (పాదము లొత్తుచుండును.)

కుచే:—ప్రాణేశ్వరీ! నీప్రవర్తన మెంతయు ప్రశంసాపాత్రమైనది. సంపద లవారిగఁ బ్రాప్తించినను దానధర్మములుసేయుట నేమఱ

కున్నదానవు. సంపదలుకూడ మోక్షసౌధమునకు సోపానములని గుర్తింపుము. ఒకరికీజన్మమున నింతబెట్టినచో ముందుజన్మమున నాశ్రీహరి మనల కెట్టిలోపమును గలుగకుండ చేయును. అన యము హరిని భజించుటయే మనకుఁ గర్తవ్యము.

ఆ. ఎన్నఁ గ్రొత్తలైన యిట్టిసంపదలు నా
కబ్బుటెల్ల హరి దయావలోక
నమునఁ జేసికాదె నలినాక్షుసన్నిధి
కర్థినగుచు నల్ల నరుగుటయును.

గీ. ఆరమానాథుఁ డఖిల లోకాధినాథుఁ
డరసె దయతోడ; తనదు హృదంతరమున
నాదు రీతినెఱింగి యనంత భాగ్య
భోగములనిచ్చి ప్రేమమై బ్రోవలేదె?

మంజ:—మహాభాగా! స్నానమందిరమునకు రండు.

కుచే:—కృష్ణా! ఇదంతయు నీదయగదా! (నిష్క్రమించును.)

---

చతుర్థరంగము.

---

[శంకరశాస్త్రి రత్నావళి]

రత్నా:—ధనమదాంధులై యానాడు కుచేలుని మిట్టమధ్యాహ్నము సకుటుంబముగ నింటినుండి వెడలనడిపిరి. రాజునకు మీపై యను గ్రహముతప్పె. ఆగ్రహము హెచ్చె. ఏమిచేయుటకును దోచ కున్నది. ఆహా మాక్షీ యదృష్టమే యదృష్టము.

శంక:—ఔను. వారిప్రాతయిల్లు మనోజ్ఞభవనమైనది. ఆసౌధమును జూచివచ్చినాను. దానియందము వర్ణనాతీతము. ఆసౌధము నిండుగ నెంతధనము? ఎందరుపరిచారకపరిచారికానివహంబులు? ఈ యైశ్వర్యమంతయు గుచేలునికెట్లు ప్రాప్తించినదో—

రత్నా:—ఎట్లా? వారునమ్మిన శ్రీకృష్ణుడే యిచ్చియుండును.

శంక:—కుచేలుఁ డాకృష్ణున కేమియుపకారము చేసెనని యిన్నిసంపదల నిచ్చెను?

రత్నా:—కుచేలుఁ డిచ్చిన గుప్పెడటుకులకే ప్రమోదమునొంది యీభాగ్యముల నిచ్చెను. మీరుకూడ ద్వారకకేగి యాతనిసందర్శించిరండు. మధురతరములైన పిండివంటలను జేసియిచ్చెదను.

శంక:—మనకట్టి యైశ్వర్యప్రాప్తి నుదుట లిఖింపబడెనోలేదో. ఆకృష్ణుని దర్శనమగునో లేదో.

రత్నా:—నాకవన్నియు దెలియవు. మీరువెళ్ళితీరవలయును. తెలిసినదా? ప్రయాణసన్నద్ధులుకండు.

శంక:—ఆహా! ఏమిచేయుదును. దీనిమాటవినకున్నచో దిండియే పెట్టదు. సరే వెళ్ళెదను. ఏదీ ఒకసారి సర్వస్వము.

రత్నా:—అహాహ్హాహ్హాహ్హా! (నిష్క్రమించును.)

శంక:—(ప్రవేశించి) చెప్పినమాటవిన్నది కాదు. చోరు లాపిండివంటల మూట నెత్తుకొనిపోవుటయేగాక యెముకలు విరుగునట్లు కొట్టినారు.

రత్నా:—అక్కటా! నాధుని పోపొమ్మని పంపిననాడే చోరులు ప్రవేశించి యింటిలోని ధనమెల్ల నెత్తుకొనిపోయిరి.

(చూచి) నాథా! అదే మట్లున్నారు?

శంక:—కర్మము. దురాశదుఃఖమునకు గారణము. చోరులు మూట నెత్తుకొనిపోయినారు. చితుకగొట్టినారు.

రత్నా:—ఇంటనున్న ధనాభరణములనుకూడ చోరు లపహరించినారు.

శంక:—అయ్యో! ఇకేమిగతి?

రత్నా:—విచారించిన ప్రయోజనములేదు. విధిప్రాతికూల్యతచేతనే యిట్టివిజరుగును. రండు. పుణ్యశ్లోకుఁడైన యాకుచేలునే దర్శించి యాతని పాదములపై బడుదము.

శంక:—అతఁడు మనల నాదరించునా? ఆతనిని నిష్ఠురాలాపములాడి హింసించిన దుర్మార్గుఁడను. పాపిని. నన్నాతఁడు క్షమించునా?

రత్నా:—తప్పక క్షమించును. ఇదియే యామహానుభావునిసాధము.

శంక:—కుచేలా! కుచేలా!

కుచే-వామాక్షి:—(ప్రవేశింతురు.)

(రత్నావళి, శంకరశాస్త్రి నమస్కరింతురు)

కుచే:—అన్నా! నీకెంతసొమ్ము నీయవలెను?

శంక:—నన్ను అన్నాయనవలదు. సొమ్ముకొఱకు రాలేదు. నేనిప్పుడు భాగ్యశాలినికాదు. మహాదరిద్రుఁడను. నాభాగ్యము చోరహస్తగతమైనది. నాపై రాజునకాగ్రహముకలిగినది. ఉద్యోగమూడిపోయినది. నాకిఁక బ్రతుకుతెఱువులేదు. నిన్నునిందించినపాపము నకు ఫలమిది. నన్ను క్షమింపుము. నేఁటినుండి నేనును ఆద్వారకావల్లభునే గొల్చెదను. నాపాతకముల నాహరిపాదపద్మముల నాశ్రయించి బాపుకొందును. కుచేలా! ముకుళితకరకమలుఁడనై నిన్నర్థించుచున్నాను. నాకు నీవేగతి. (పాదములపై బడును.)

కుచే:—(ఆశ్చర్యపడి) సోదరా! లెమ్ము. ఆజగత్కల్యాణమూర్తి—ఆయశోదానందనుఁడు—నిన్ను రక్షించుగాక—నీకు మోక్షమిచ్చుగాక. సతీమణీ! పరిచారికులతోఁ జెప్పి, వీరికి వలయు ధాన్యమును, యితర సంబారములను బంపించుము. శాస్త్రీ! నేఁటినుండి నీవు తప్పక యాగోవిందుని స్మరించుచుండుము. అమ్మా! రత్నావళీ! పతిభక్తియుక్తవై మెలఁగుచు నాహరినామ సంస్మరణంబొనరించుచున్నచో మీకు నిఖిలైశ్వర్యములును గలుగును. మీకెట్టిలోపము కలుగకుండ చూచుభారము నాది. నేఁడు

ᵒజనమొనరించి, మాకానందము కలిగించుడు,
కు ధరించుటకు వలయు చీరల నిమ్ము.
ళవుఁడు, మిగిలిన పిల్లలు వత్తురు.)

నేను చెప్పినది మఱువకుఁడు. హరిభజనమే భవ సాగరము తరింపజేయుకాక—హరిచరణసేవయే నిరవధికానంద దాయకము—మీరందఱు లోకైక నాథుఁడగు శ్రీకాంతునే భజింపుఁడు.

రత్నా:-శంకర—ధన్యులము. జై! శ్రీకృష్ణపరమాత్మకు జై.

రంగ:-మాధవ:—జై! శ్రీకృష్ణపరమాత్మకు జై!

కుచే:-వామా:—జై! శ్రీకృష్ణపరమాత్మకు జై! మిత్రులారా! లోకారాధ్యుఁడగు శ్రీకృష్ణునకు సైతము బ్రాహ్మణుఁడే దైవము. అందుచే బ్రాహ్మణజన్మ మహోత్కృష్టమైనది. అట్టి జన్మ లభించినందులకు వృథాగర్వమునొందక హరిచరణాంబుజ సేవనమే జీవనముగాఁ గొని కాలము గడపుట యుక్తము.

ఆ. దేవదేవుఁ డఖిల భావజ్ఞుఁ డాశ్రిత
వరదుఁడైన హరికి ధరణి సురలు
దైవతములు గాన ధారుణి దివిజుల
కంటె దైవమొకఁడు కలఁడె భువిని?

గీ. భక్తియే సాధనంబిల ముక్తి కనెడు
నీతి బోధించి, దివ్యమై నెగడునట్టి
ఈకుచేలుని చరితమ్ము నెవరువిన్న
వారి కిలఁగల్గు భాగ్యమపారముగను.

స మా ప్త ము.

---

# అనుబంధము

అనుబంధము 1 కుచేలుఁ

భాగేశ్వరి—త్రితాల్

పాదము

నీమహిమ మరయ నేనె

త్రుఁడు మనల

సుఖదుఃఖంబులను గల్గించు

లీలకాదె నీకు మాపై నెపుడు కల్గునో దయ

గాఢదారిద్ర్యాంధకార కలితమయ్యె హృత్సీమ

కష్టములవి మాయమై సుఖంబుకల్గునో లేదో ॥అకటా॥

అనుబంధము 2 శ్రీకృష్ణుడు.

పీల్—త్రితాల్.

కలహింపగనేనా చెలులారా ॥కల॥

కడుంగడు ముదమొందగనే నీమెడ ॥కల॥

కారణరహితమౌ కలహముగాదా

భక్తియోగమో ప్రేమయోగమో

పరమోత్కృష్టంబై వెలయునుగా ॥కల॥

అనుబంధము 3

హిండోల్—త్రితాల్.

ననుజేరరాకుమోయి కపటీ ॥నను॥

నచ్చికమాటల నలరింతువుగద

నాగృహమ్మునకు జనుదెంచినప్డు ॥నను॥

నాతో ప్రణయమె ముక్తినిచ్చునని

నమ్మికతోపక బల్కియిపుడిటుల

వంచనసేయుటతోనె తెలిసెనహా ॥నను॥

అనుబంధము 4 నారదుడు

యమునాకల్యాణి—ఆది.

శ్రీగోపాలశౌరి శ్రితజనపరిపాల ॥శ్రీ॥

శ్రీకాంతప్రశాంతమధురమైన నీనామస్మరణమె

నెంచి వచించితి ॥శ్రీ॥
న అమరవంద్య ఆగమాంత
సుకృప ॥శ్రీ॥

అనుబంధము 6 నారదుఁడు.

యమునాకల్యాణి—ఏక.

దేవ కథాస్మరణము
భవసాగరతరణముగదా ॥దేవ॥
దివ్యప్రభావ చిక్కెనె కావా?
దీనజనశరణ్యా భక్తపాల ॥దేవ
తెలియలేరు నీమహిమ లనంతముల్
పలుకలేరు నీపావనచరితముల్
తెలిసిన పలికినవారికిమోక్షము
సలలితముగ లభియించునుగా ॥దేవ॥

అనుబంధము 7 రత్నావళి.

సారంగ—త్రితాల్.

భక్తికంటె నీయిల మైశ్వర్యమె
పరమసుఖదమై యలరునుగా లహో ॥భక్తి॥
భక్తితత్పరత బహుళదారిద్ర్యం
బనుభవించుగద కుచేలుడకటా
యెటులైనను నాతనినైశ్వర్యము
నెపు ననురక్తుంజేయుదు నేనిక ॥భక్తి॥

అనుబంధము 8

భీంప్లాస్—ఏక

దుఃఖానలమే దారిద్ర్యదుఃఖానలమే
చిత్తమును దహింపగజొచ్చెగ ॥దుఃఖా॥
శ్రీహరిసేవామృతపానముచే నా
చింతలెన్న డికఁ తొలఁగునో యేమో ॥దుఃఖా॥

అనుబంధము 9 నారదుఁడు. మః

గోవిందంభజరే హేగోపాలంభజరే
గోవర్ధనగిరిధారీశౌరీ గోకులబృందా
గోపీజనమనోహర కంసారీ పూతనః

అనుబంధము 10 నారదుఁడు. భారే

శ్రీరమామనోహర గోపాల శ్రితజనపఁ
శ్రీకరకరుణాసాగర మునిజనలోకరత్నామణి శీఘ్రమెబ్రోవుము॥శ్రీ॥
హేభక్తజనపరిపాలన శ్రీకాంత సంతతానందదాయక ॥శ్రీ॥

అనుబంధము 11 నారదుఁడు. యమునకల్యాణి—ఏక

హరిచరణాంబుజసేవనమే యిలజీవన మమృతమధురిమమూ॥
కరిరాజవరదుని పావననామస్మరణము పాతకహరణమగుఁ ॥శ్రీ॥
సురుచిరసుందరమోహనమూర్తిని సువిశాలలోచను నుతియింతుఁ॥

అనుబంధము 12 నారదుఁడు. నాట—దాద్రా.

బృందావనశౌరీ - గోకులబృందవనశౌరీ ॥బృందా॥
గోగోపకిశోరా మురహర కోటిమదనసౌందర్యవిభాసిత ॥బృ॥
మోహనవినీల జలధరమూర్తి మురళిగానలోలా సుందరమూర్తి ॥బృం॥

అనుబంధము 13 కుచేలుఁడు. శిలాంగ్—త్రితాల్.

శ్యామసుందరమదనమోహన సన్నుతింతు జాలమేల
చేసెదీవు బ్రోవరావె చేరిమ్రొక్కువాఁడనిన్ను ॥శ్యామ॥
ప్రేమతో నినుభజియించుచుంటి ప్రియతమాయని పిలుచుచుంటి
వేగదర్శనమ్మొసంగి వేడ్కమీరబ్రోవరాదె ॥శ్యామ॥

---

శ్రీరామముద్రాక్షరశాల, రాజమండ్రి—1935.

# శ్రీ కూరి నారాయణరావుగారి

ప్రసిద్ధముగానున్న 5 నాటకములు

# చింతామణి రు 1

వఱకును వ్యాపించి, అఖండ యశస్సు

...లం బుట్టించిన అసలు చింతామణి.

# వ్యూహము రు 1

బహు రసవంతమైన భ...నాటకము. అభిమన్యుని యుద్ధఘట్ట మిందు అత్యద్భుతముగా వర్ణింపబడినది. చదివినకొలది చవులూరి శరీరము పులకించి మనసు పరవశ మగును! అక్షర నిక్షేపము!

# వరవిక్రయము రు 1

వరవిక్రయ మనగా:—వర్తమానకాలమునందలి వరశుల్క పిశాచముపై ప్రయోగింపబడిన వజ్రాయుధము! పాఠకులపాలిటి భగవత్ప్రసాదము! వరశుల్కముల వైఖరులు - మగపెండ్లివారి మారాము ళ్లు ఆడపెండ్లివారి యవస్థలు - చదివిన చట్రాయిగూడ నీరగును.

# మధుసేవ రు 1

మధుసేవ యన:—మనదేశమున కిప్పుడు మహా శత్రువై యున్న మద్యపానముపై ప్రయోగింపబడిన మారణాస్త్రము! కడుపు చెక్కలగు హాస్యరసమును కన్నీరు మున్నీరగు కరుణ రసమును సర్వత్ర పొంగి పొరలుచుండును! ఇట్టి నాటక మిదివరకు పుట్టలేదు.

# చిత్రాభ్యుదయము రు 1

సరసమై, సభ్యమై, శ్లాఘ్యమై, సత్యమైన సారంగధర నాటకము. ప్రతిపద్యమును బంగారుమునక బహుచిత్రము! బహుచోద్యము!

# ఆంధ్రదేశమున ప్రదర్శించు న

బళ్ళారి ధర్మవరం కృష్ణమాచార్యులు గారిచే రచింపబడినవి.

| | రు. అ |
|---|---|
| చిత్రనళీయము | 1-4 |
| విషాదసారంగధర | 1-4 |
| పాదుకాపట్టాభిషేకము | 1-4 |
| చంద్రహాస | 1-0 |
| ప్రహ్లాద | 1-0 |
| మోహినీరుక్మాంగద | 1-0 |
| బృహన్నల | 1-0 |
| ప్రమీలార్జునీయము | 1-0 |
| పాంచాలీస్వయంవరము | 1-0 |

బళ్ళారి, పండిత కె. సుబ్రహ్మణ్య శాస్త్రులు గారిచే రచియింపబడిన

| | |
|---|---|
| సంపూర్ణ మహాభారతము | 1-0 |
| కృష్ణలీల | 1-4 |
| లవకుశ | 1-4 |

బళ్ళారి, ధర్మవరం గోపాలాచార్యులు గారిచే రచియింపబడిన

| | |
|---|---|
| రామ్‌కబీర్ | 1-4 |
| ఫాలాప్ విజయనగర్ కో. ను. | 1-4 |
| సుల్తానాచాందుబీ | 1-0 |

పానుగంటి లక్ష్మీనరసింహారావు గారిచే రచియింపబడినవి.

| | |
|---|---|
| పాదుకాపట్టాభిషేకము | 1-4 |

ప్రచండ

కంఠా

చూ

విచిత్ర

చిలక.

గ

| | |
|---|---|
| గయోపాఖ్యానము | 0-8 |
| ప్రసన్నయాదవము | 0-8 |
| పారిజాతాపహరణము | 0-8 |
| చతురచంద్రహాస | 0-8 |

కొప్పరపు సుబ్బారావుగారిచే రచియింపబడినది.

| | |
|---|---|
| రోషనార జహన్గీర్‌బాయి | 1-0 |

కందుకూరి వీరేశలింగం పంతులు గారిచే రచింపబడిన శకుంతల 1-0

నద్దాది సుబ్బారాయుడు గారిచే రచియింపబడినది.

| | |
|---|---|
| వేణీసంహారము | 1-0 |

బలిజేపల్లి లక్ష్మీకాంతం కవిగారిచే రచియింపబడినవి.

| | |
|---|---|
| సత్యహరిశ్చంద్రీయము | 1-0 |
| ఉత్తరరాఘవం (కుశలవ) | 1-4 |

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారిచే రచియింపబడినది.

| | |
|---|---|
| బొబ్బిలియుద్ధము | 1-0 |

